శ్రీరస్తు.

# సారంగధరచరిత్రము.

చేమకూర - వేంకటపతి
ప్రణీతము.





చెన్నపురి:
వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.

1922



శ్రీ ర స్తు.

# సా రం గ ధ ర చ రి త్ర ము

## ప్ర థ మా శ్వా స ము.

---



ధుర్య శౌర్యధైర్య
త్స్థాధరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక వితరణదీక్షా
రాధానుత యచ్యుతేంద్రరఘునాథనృపా. 1

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన సారంగధరచరిత్రం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 2

క. రాజనరేంద్రుఁడు రిపుఫణి
రాజనరేంద్రుఁడు కళా పరాక్రమ రేఖా
రాజితభోగ పరాజిత
రాజనరేంద్రుఁడు సుధాకరకులుం డలరున్. 3

సీ. తనయభ్యుదయము నిత్యము గోరి నిజసుహృ
ద్ద్విజబుధవ్రాతంబు వేడ్క నుండఁ

బగలెందుఁ బొడ గానఁబడకుండ నడఁచినాఁ
డమృతమే యారూప మయ్యె ననఁగఁ
దనపాదమునకును దమతలలకు లంకె
పా టని దుర్గాధిపతులు వల్కఁ
జల్లఁదనము గల్గుసన్మార్గవర్తి మేల్
మాయన్న యని ప్రజల్ గాంచి మ్రొక్క
గీ. జారచోరాదులకు భీతి సంఘటిల్ల
సహితచక్రము లల్లల నాడుచుండ
నేలె నారాజు కువలయ మింపు దనర
నాడె తప్పక భరతమర్యాద వెలయ. 4
గీ. మహిని రాజనరేంద్రుఁడు మాళవపతి
రాజరాజనరేంద్రుండు రాజరాజు
ననఁగఁ బేరెన్నికకు నెక్కె యతిశయిల్లు
నింద్రవిభవుండు రాజమహేంద్రవిభుఁడు. 5
క. కల చాళుకులరాయనికిం
గులసతి రత్నాంగి భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు నన
నెలజవ్వను లిరువు రంబుజేందునిభాస్యల్. 6
క. ఆతనికిఁ శక్తిత్రయ
రీతిం గడుఁ బెంపు గాంచిరి నయార్ణవుఁడుఁ
నీతిజ్ఞుఁడు మతిమంతుఁడు
ధీతిలకంబు లరయఁ సుధీతిలకంబుల్. 7
గీ. ఈక్రమంబున రాజనరేంద్రవిభుఁడు
నీతిరహితంబు గాకుండ నీతిరహిత

మానటుల భూమి రామరాజ్యముగ నేలు
చుండి రత్నాంగిఁ గనుఁగొని యొక్కనాఁడు. 8

సీ. సంతానరహితసంసారంబు నాయక
రత్నంబు లేనిహారంబు గాదె
పుమపత్యదూర మానమితసామ్రాజ్యంబు
ధాత్రిఁ జంద్రుఁడు లేనిరాత్రి గాదె
యాత్మజవ్యతిరిక్త మగువర్తనముఁ జూడ
నారి లేనిశరాసనంబు గాదె
సుకుమారశూన్య మానకళంకజీవనం
బలమురాళము లేనికొలను గాదె

గీ. నందనవిహీన మైనసేనావితాన
మరయ శిఖరంబు లేనిగోపురము గాదె
నేత్రపర్వంబు గావించుపుత్త్రుఁ డింక
మనకు నెన్నఁడు గల్గునో వనజగంధి. 9

మ. జిలుగుంబల్కులు విన్నఁ జిన్నిగొనబుంజెయ్వ ల్గనుంగొ
న్న నా, దల మూర్కొన్నను ముద్దుగొన్నఁ దనువుం దా
ర్కొన్న నూహింపఁగాఁ, బలుకీ గానిసుఖంబుఁ జెందు
నటు గాఁ బంచేంద్రియోత్సాహ మై, తలిదండ్రు ల్వేలసిల్లఁ
గాఁ దనయుఁ డేత్రాత్రుఁడే యెన్నఁగన్. 10

ఉ. చక్కిలిగింత వెట్టినను సారెఁ గికాకిక నవ్వుచుం బయిం,
బక్కఁ బడంగఁ జక్కనిసుమారుని మక్కువమీఱ నేడ్పు
రాఁ, జెక్కిలి గీఁటి యెత్తి యెదఁ జేరిచి ముచ్చట దీఱ
నట్లుగా, నక్కట ముద్దులాడ వలదా వలదా యిటువంటి
భాగ్యమున్. 11

క. ఈశ్వరకృప గద యీనర
లైశ్వర్యము లెల్లఁ బ్రాప్త మగుటకుఁ గాశీ
విశ్వపతి మనకు నిపు డో
శాశ్వతయశుఁ దైనసుతుఁ బ్రసాదింపఁడొకో. 12

గీ. తాఁ గుమారునిఁ గని ప్రమోదంబు గాంచు
నట్టిసర్వజ్ఞుఁ డఖిలభక్తాళిఁ బ్రోచు
శంకరుఁడు మహాదేవుఁ డాసామి నన్ను
నార నాఁట మాఁకోర్కి యీడేఱు టరుదె. 13

గీ. ఇవుడు శైవవ్రతంబు లే మేమి గాన్పు
నలుపఁ దగు నాని నటు శైవ సభల మగుచు
భక్తజనులకు ముంగొంగుఁబసిఁడి గాఁడె
చూడు మెలనాగ యల చంద్రజూటుఁ డరయ. 14

క. నెలవ్రా దాలుపు మాఁవ్రా
జలు మెచ్చురె యని మదిఁ విచారింపకు నీ
కిలిమాకిలి గానిన
చెలఁది తెర లూన్పని సంతసించుట లేదే. 15

క. ఇటుఁ బూజింతేము నీర్చిన
యటులు గిరీశు [illegible] గొం డో
[illegible] జేసి దేవరకును గోర్కె
[illegible] 16

గీ. అం ప్రియో[illegible] శిక్షఁ గొని [illegible]
సకలజన[illegible] శివపూజ [illegible]
నాజ్ఞ యని చాటఁ బనిచి శివాలయమ్ము
ధరణిఁ గట్టించె నూరూరఁ దప్పకుండ. 17

క. రాజశిఖామణిపూజలు
రాజశిఖామణి యొనర్చె రమ్యదళాళిన్
రాజీవకుముదచంపక
రాజీవకుళాదికుసుమరాసుల వేడ్కన్. 18

క. వివిధఘనదానములు భూ
ధవమణి పరిశుద్ధబుద్ధి ముదంబున నొసఁగెన్
శివభక్తులు పెద్దలు నగు
నవనీసురవర్యులకు శివార్పణ మనుచున్. 19

గీ. అంతఁ గాశీవిభునిపూజ కరుగుదెంచి
పత్నియును దాను నత్యంతభక్తితోడ
స్నాన మొనరించి నయనహస్తములు మోడ్చి
దేవ పురహర శ్రీమహాదేవ యనుచు. 20

సీ. స్నానం బొనర్చె [illegible]ందా[illegible]కరునకు
వస్త్రం బొసఁగె [illegible]వాసునకును
రత్నాసనము [illegible]యున
కలఁదె గంధము [illegible]ను
నవరించెఁ బుష్పంబు [illegible]శేఖరునకు
నిచ్చె ధూపం [illegible]
మునిజదీ[illegible]
[illegible]మిడె [illegible]నునకు

గీ. దండ [illegible]నకు
నమిత [illegible]
నిబిడ[illegible]
డగుమ రాజ[illegible]ంప్రథ రాష్ట్రవిభుఁడు. 21

సీ. మంత్రాభిషేక మేమర్యాదఁ జేసెనో
తల కెక్కెనవిషంబు దొలఁగలేదు
గారుడమణిహార మేరీతి నిడియెనో
మెడఁ జుట్టుకొన్నపా మెడలలేదు
నుదుట గంధం బెట్లు నూల్కొనఁ దిద్దెనో
నెఱియ మూసినకన్ను దెఱవలేదు
ధూపవిశేష మేరూపునఁ గూర్చెనో
వెంటాడుభూతముల్ విడువలేదు
గీ. తెలియ నమృతకరుం డనఁ జేఁదిల్లు
నోషధీశుకులంబున నుద్భవిల్లి
యెన్నికకు నెక్కురాజమహేంద్రవిభుఁడు
పంచశరవైరిపూజ గావించుఁ బ్రీతి. 22

ఉ. చేరి నృపాలుఁ దర్పణము చేసెఁ జక్కెర లుప్పతిల్లువం
దేరము లారగించుచు నుతింపఁదొడంగె మహేశుఁ డింపునన్
సారెకుఁ గుత్తుకన్ విషము నాలుక బెల్లము వెట్టి యాడుటల్
మేరలటయ్యె స్వామికని మేలములాడుచు గౌరి నవ్వఁగన్.

గీ. ఇట్టు లత్యంతభక్తిమై నెవ్వఁడు సంత
రంగవైభవముల సముద్రంబు లైన
యారగింపుల సంతుష్టి సలుపరించి
శివుఁ ద్రికాలంబులందుఁ బూజించుచుండె. 24

క. నందనసంతానము మది
యందుం గోరుచు భజింప నాశ్రితపటలీ
నందనసంతానం బగు
నిందుకళాధరుఁడు పార్వతీశ్వరుఁ డంతన్. 25

సీ. వరదానసంపద వామోత్తమాంగముల్
  శైలజాగంగల సాక్షి దెలుపఁ
గోపప్రసాదైకగుణరూఢిఁ జూపులు
  చందమామల్లుని సాక్షి దెలుప
ఖలశిక్ష సాధురక్షణమున్ గటియుఁ గేల్
  శార్దూలమృగముల సాక్షి దెలుప
ననుపమాభ్యాసితాగమనిగంకాళంబు
  సరసీరుహాక్షుల సాక్షి దెలుప

గీ. బంధురాకార భూతులు పరిఢవిల్లఁ
దనదురాజశిఖామణిత్వంబు వెలయఁ
బ్రమదమున మందహాసాననములతోడ
వచ్చి ధరణీశులేంద్రుని స్వప్నమునను. 26

గీ. ధారుణీనాథ విను మేను దాల్కీన
నదమలాత్మక భక్తికి సంతసిలితి
నీవు చేసినపూజ సర్వింపఁ దరమె
యిదిగో నిపుడె ఫలించు నీయాప్సితంబు. 27

క. రత్నాంగి కుదయు మా కొక
రత్నమువంటిసుతయుండు రమణీయకళా
నూత్నవారాంకుఁ డానత
రత్నము విను నాదుపేరు రాజనరేంద్రా. 28

క. అని యోగిసంతలో ది
గ్గన మేల్కని విభుఁడు హా మహాదేవ యటం
చును మేను గగుర్పొడువఁ
దను మోడ్పున్న్యమున్గుఁ డయ్యెన టంతన్. 29

క. జననాథచంద్రుఁ డివ్విధ
మున బహువిధదానములనుఁ బుత్త్రోత్సవ మిం
పొనరంగఁ జేసి సూతక
దినములు వెడలించె ముదము దేజరిలంగన్. 41

ఉ. పొంగుచు బంధుమిత్త్రబుధపుంగవమంత్రిజనంబుఁ జూచి తె
ల్పెం గలలోన వచ్చి మునుపే తనపే రిడు మంచు వేడ్కతో
నంగజవైరి యాయనదయం గద గల్గె నటంచుఁ బల్కి సా
రంగధరాహ్వయం బిడియె రాజనరేంద్రుఁడనుంగుఁజూలికిన్.

వ. ఇట్లు కృతనామకరణుం డై రాజసూనుం డనుదినప్రవర్ధమా
నుం డగు చున్నంత. 43

ఉ. పాలెడలోనఁ బోసి చనుఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వ్రేల్ నెలవిప్పి నెడ గానిడి యుగ్గు వెట్టి యా
కే లటు బొజ్జపై నిమిరి కెంజిగిచేతుల నెత్తి గట్టురా
చూలియనుంగుసామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్.

క. కన్నుంగవఁ గాటుక యిడి
చన్నిచ్చుచు నేడు పుడిసి చక్కనిముద్దుం
జిన్నికుమారుని మారుని
పెన్నద్దిని బత్తి నత్తి పెంచిరి దాదుల్. 45

గీ. లాలి గట్టిరి గంధోపలాలిశాఖ
లాలిసుమసాంద్రచంద్రోపలాలిసౌధ
లాలిస్థలి హారునియిల్లాలిఁ బాడి
మేలిజవరాలిగములు రాచూలి కపుడు. 46

ఉ. పూ నెఱి మేని రాకొమరుఁ బొత్తులలోపల నుంచి గట్టువి
ల్కానివరప్రసాదమునఁ గల్గినచక్కనియన్న నిద్రపో
మ్మా నను గన్నతండ్రి యని మక్కువఁ జొక్కఁగ జోల
వాడి రిం, పూనినజాళువాపసిఁడియుయ్యెల నయ్యెలనాగ
లూఁచుచున్. 47

క. జోల ల్పాడిరి యమృతపు
జాలుం జోకొట్టఁ జాలుసరసపుఁజూపుల్
డోలాయమానముగ ను
య్యాలో జంపాలో యనుచు నాలోలాక్షుల్. 48

సీ. కను ఱెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన
నుంగుంగ యని సారె నుగ్గడింప
నెలనవ్వు పాలబుగ్గలపై దువాళింప
న త్తత్త యని డొంగి యాడుచుండ
విద్దెము సేయుచు వింత లే కెవ్వరు
చప్పటు ల్బఱచిన సరగ నరుగ
జిలిబిలిముద్దుమాటలతోడ దాదిప్రే
లంది మెల్లనె తప్పటడుగు లిడఁగఁ

గీ. గనుమొరంగి చెలుల్ మఱుంగున నడంగి
తొంగి చూచి దూబూచి యన్నం గికాకి
క న్నగఁ గుమారుఁ గౌఁగిట గారవించి
యలరుదురు వేడ్కఁ దలిదండ్రు లనుదినంబు. 49

మ. కరముల్ సాఁచి తమిన్ ద యింద యని రాగం బొప్పఁగాఁ
జీరఁ దా, మరమోమందలిరావిరేకతులకింపన్ జేరి బింబా
ధరం, బరు దారన్ రసవంతమై మెఱయఁగా నంకంబుపై

నిల్చి బా, పురి సారంగధరుండు ముద్దు గురియుచోం
తండ్రి యుప్పొంగఁగ. 50

గీ. ఇనకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్నిసారంగధరుఁడు భాసిల్లుకరణి
నినకరస్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్నిసారంగధరుఁడు భాసిల్లె నంత. 51

ఆ. ఇట్లు తల్లిదండ్రు లెంతయు గారాన
నేఁటఁ బెంచువానిఁ బూఁటఁ బెంచి
సరవి వరవిభూతిఁ జౌలోపనయనాది
సత్క్రియాచయంబు సలిపి రంత. 52

వ. ఇట్లు యథాకాలప్రాదుర్భావం బై తేజరిల్లి శాస్త్రంబులు
క్రోడీకరించి పురాణంబులు హృద్గతంబులు గావించి నీతులు
విస్తరంబుగాఁ దెలిసి గజహయరథారోహణంబు లభ్యసించి
బహువిధాయుధసాధనల నాఱితేఱి సకలవిద్యాపారీణుం
డయ్యె నప్పుడు. 53

క. సారంగధరుఁడు మించెఁ
ధీరత బహువేదశాస్త్రదీక్షాగురు వై
సారెకు సత్క్రమవిక్రమ
భూరి కళావిభవసారపుంగవు లెంచన్. 54

సీ. శ్రుతిమార్గముల నంటి శోభిల్లెఁ దెలివిమై
నాతనిచూడ్కి యే మనఁగ వచ్చు
సాధుకుంజరపంక్తిసంగతి విలసిల్లు
నాతనినడక యే మనఁగ వచ్చు

దాక్షాయణీనాథుఁ దగిలి లోఁగొనఁ జాలు
నాతని తేజ మే మనఁగ వచ్చు
నించువిల్కాని జయించు నాతనినిర్జ
లాకారసుషమ యే మనఁగ వచ్చు

గీ. వసుధఁ బుట్టెడు పెరిగెడు వారిలోనఁ
గని విని యెఱుంగ మంతటిఘనుని నౌర
యీడు జోడును సరి సాటి యెందు లేద
తం డమర్త్యుండు గాక మర్త్యుండె తలఁప. 55

క. మాడెత్తు మాట యెవ్వరి
నాడఁడు సత్యంబు వీడ నాడఁడు ఖలులం
గూడఁడు పరకామినులం
జూడఁడు సారంగధరుఁడు సుతమాత్రుండే. 56

క. ఔరా యని జను లెన్నఁగఁ
గూరిమిఁ దండ్రిమాట గురువాక్యముగా
గోరంతయు జవదాఁటక
యా రాజకుమారచంద్రుఁ డలరఁగ నంతన్. 57

మ. వనజాతాహితవంశవారినిధిభాస్వత్కౌస్తుభం బై నరా
జనరేంద్రుండు నవీనయౌవనవిలాసశ్రీ జగన్మోహనాం
గుని సారంగధరున్ విశేషగుణయుక్తున్ యౌవరాజ్యాభిషి
క్తునిఁగావించినిజాన్వయంబునమహాశోకాప్తవంశంబునన్.

క. పేరుగలఘూర్జరాధిపు
గారాబుఁగొమార్తెఁ బెండ్లి గావించెఁ దగన్
సారంగధరునకున్ మన
సారంగను మంజువాణి యను నలివేణిన్. 59

క. తారావళి యఁట నఖము లు
రోరుహములు రెండు మంజరులె యఁట నేత్రా
కారంబులు ధవళము లఁట
యారమణీ మంజువాణి యనఁ జెల్లదొకో. 60

గీ. సకలవైభవములతోఁ బొసంగ నిటులు
రాజరాజవిభుండు గారాబు గొడుకుఁ
బరిణయ మొనర్చి యానందభరితుఁ డగుచు
నుండెఁ గొన్నిదినము లంత నొక్కనాఁడు. 61

సీ. నిలుచుండి చంకఁ జేతులు వెట్టుక కిరీట
ములు గలరాజులు కొలువు సేయ
వేటాఱు తునియలు వేయు మేలైనవ
జీర్లు వచ్చి సలాము చేసి నిలువ
శరణాగతారాతిధరణీరమణు లయ్య
జియ్యలు వెట్టుచు సేవ సలువ
సాటికిఁ బోటికి సరసనంగీతసా
హిత్యాదివిద్యలు నృత్య మాడ

గీ. మనవిసనవుల కేతెంచి మన్నవారు
వేళ యెపు డౌనొకో యని వేచుండ
నమ్మహీపాలుఁ డపుడు సింహాసనస్థుఁ
డగుచు నొడ్డోలగం బున్నయవసరమున. 62

మ. పులితోల్కాసెల నంట దోపినపిడెంబు ల్నాలివ్రేఁదావ
ళం, బులు బల్సింగవుఁజుంచుదండకడియంబుల్ చెంపలఁ
జెక్కువీఁ, కలు కెంజేగుఱుబొట్లు జంజుఱుసిగల్ గొరంపు

మైపూఁతలుఁ, బలుదూపు ల్వెదవిండ్లును నైలు వానర్వఁ
వచ్చి కే ల్మోడ్చుచున్. 63

క. జల్లులు పునుఁగుఁజవాదుల
పిల్లులు కుందేటిలేటిపిల్లలు మొదలౌ
నెల్లసువస్తువులను శో
భిల్లం గానుక లొసంగి భిల్లజనంబుల్. 64

శా. సామీ వింజపుఁగొండకాఅడవిపజ్జఁ గూడెముల్ గట్టి మీ
నేమంబే నతమిచ్చుఁ గోరి బలుబై సీఁ బాగ్గముఁ గల్గి యా
బూమిఁ వేఁటలఁ దోఁటలం దిరిగి మీగాపున్నన మాకచ్చికం
బేమిఁ లేక సుఖాన నుండుదుము నీవే దిక్కుగా నెమ్మదిఁ.

ఉ. అయ్యవరాకు మూని తెలియఁ విను లచ్చనదేవుఁడుఁ సిరా
మయ్యయు సీతమమ్మగారిక్కై తొలుతఁ గనుపట్టుముచ్చు
బల్, దయ్యపు మూఁకఁ జెండినపొలానకు మొన్నను వేఁట
లాడుకొఁ, జయ్యనఁ బోయి యాయడవిచాయలఁ గంటిమి
వాల్మెకంబులఁ. 66

క. అందల మొందల లే కివు
డందలమంద లయి యున్న నయ్య మొకంబుల్
చెందామర కొలనివలెఁ
దెందేవ ల వేమి సెప్ప దేవుఁ డెఱుంగుఁ. 67

సీ. క్రోల్పులు ల్కంపిల్లి గొటగొటమని రొప్పి
బలుసింగముల నైనఁ బట్టఁ జూచుఁ
గండక్రొవ్వునఁ గన్ను గానక పందులు
బిరుదేనుఁగుల నైన నొరయఁ జూచుఁ

గాఱువుల్ దిని యూము కవిసి మఱపోతులు
 కారుపోతుల నైనఁ గదమఁ జూచుఁ
బోతరించి సివంగు లీకలాకల నేచి
 గబ్బిమెల్గులనైన గిబ్బఁజూచు
గీ. సాధు వానిచలంబు మచ్చరము బలిమి
యెక్క డేవంక నే మని యెంచ వచ్చు
నొకటి నొక్కటి నడ్డనేయక మెలంగు
నాపొలంబునఁ దరతరం బై మెకములు. 68

గీ. జింకదాఁటులు మంచి తేజీలపిల్ల
లనఁగఁ దగి యుప్పరము దాఁటునవ్వి దడ్డ
మైనఁ బడ దాఁటు నెలలేడి నైన దాఁటుఁ
జిఱుతపులి నైన నే మని చెప్ప వచ్చు. 69

గీ. ఏనుఁగుమదంబువఱద గాఱెనుపపాలు
వందినేవెల్లువలు చిక్కఁబాఱుచెమ్మ
దఱుఁగ దలమందు వేసవిఁ దఱుమఁ గలుగఁ
జాల్ మెకా లందు దొవ్వున జాతి పదును. 70

ఉ. ఉల్లములోన నే మనుచు నుందువొ యేనొకదబ్బదబ్బదర్
బల్లిదపున్వరాహములు భద్రగజంబులమీఁద నాదుకోఁ
వెల్లుగ నక్క వానికొనవెండ్రుక రొక్కటి రెమ్మి దీసినన్
జిల్లున వెళ్లఁ బో చమురు చిమ్మనగ్రోవిని జిమ్ముకై వడిన్. 71

సీ. తాము శక్తిహయంబు లై మంద మని సుమీ
 మొగులు చొచ్చినయట్టు లెగురుచుండు
దిక్కూలములు మోచి కొక్కొంద మని సుమీ
 యలదరు ల్తాము గోరాడుచుండుఁ

పాతాళ మటు చొచ్చి బ్రదుకుద మని సుమీ
తాము వేమఱు భూమిఁ ద్రవ్వుచుండు
మింటఁ జందురుఁ జేరి మే లౌద మని సుమీ
తాము నుప్పరమును దాఁటుచుండు

ఆ. హరులు కరులు గిరులు హరిణంబు లనయంబు
తొలుతఁ బెద్ద లెఱుఁగునొళ వెఱింగి
యటులు పోవనిత్తు మఁటవయ్యా తముఁ జుట్టి
పట్టి నేలతోడఁ గొట్ట కిపుడు ? 72

సీ. వెదురుచే లక్కలువు దీసి దినంబుఁ గాపాడు
కమతీలు మా కేశలములు సుమ్ము
కరిము త్తియపు రేకఁ గనిపట్టు సంగాత
కాండ్రు మా కల్ల సింగములు సుమ్ము
జింక వేఁటలఁ గాచి జంకించి దొడ్డిఁ దో
ల్గొల్లలు మాకుఁ గోల్పులులు సుమ్ము
పుట్టజు న్నంగళ్లఁ బెట్టించువాడుక
కోమట్లు మా కెల్గుగొల్లు సుమ్ము

గీ. వాటిలో నిసుమంత తాటోటు చేసి
యటమటింపక యుండఁ బైయద్దికముగ
నేవఁ దిరుగాడువిశ్వాసు లెపుడు మాకు
జాగిలంబులు సుమ్ము మాసామి కాన. 73

సీ. ఒకసింగ మల్లన త్రికిఁ గ్రిందు చొచ్చుట
మాధాక కటు నిల్వ నోడి కాద
వాలుఁదొల్పంది పాతాళంబుఁ దూఱుట
మాధాక కటు నిల్వ నోడి కాద

హారిణం బొకటి రాజు శరణంబుఁ జొచ్చుట
మాధాక కటు నిల్వ నోడి కాద
వడి దచ్చియేనుఁగుల్ కడభూమిఁ జేరుట
మాధాక కటు నిల్వ నోడి కాద

గీ. కను గలిగి మున్ను తప్పించుకొనియెఁ గాక
కొట్టి కోలాహలము చేసి కూలఁ గ్రుమ్మి
చెండి చెకపిక లాడమా యుండెనేని
మించి పోయిననుద్దుల నెంచ నేల. 74

చ. అన విని మందహాస మొలయం దనుతోడ విభుండు పొం
దు మీఱ, వెనుకను వత్తు నన్నియును వేఁటకు నాయితపెట్టుఁ
డిప్పుడే, యని యచిరత్న రత్నఖచితాభరణాంబర పంక్తు
లిచ్చి పం, చినఁ గొని చెంచుతేం డ్రపుడు సింగఁడు బూ
రఁడు నై ముదంబునన్. 75

క. కైవడి మెకములఁ గ్రుమ్మెడి
కైవడి మా యూప చేవ కనఁ బోమెదుగా
దేవర మాదేవరవలె
వేవేగమె సామి వేఁట విచ్చేయవయా. 76

క. చని రంత వేఁటఁ బోవం
జన మీా రాయిత్తపడి వెసఁ రం దనుచుఁ
జనవరులఁ జనవరులఁ
మన సరలఁ దొరల ననిపి మహిపతి దానుఁ. 77

గీ. అంతిపురమేఁగి మజ్జనం బాడి వేఁటఁ
బోవుతఱి దేగపడనుగ భోజనంబు

నేసి యాఖేటవిహారణోచితము గాఁగ
త త్తడంబునఁ గై నేసి చి త్తరువుగ. 78

సీ. ఒంటిముత్తెములతో నొంటికెంపులకాంతి
చెక్కులజవ్వాదిఁ జికిలి నేయ
హురుమంజిముత్యాల యొరగుపాగమెఱుంగు
నొసలిచి త్తరిబొట్టు ముసుఁగు వేయ
జాతినీలపుఁదాళిచాకచక్యప్రభల్
కస్తూరినెఱిపూఁతఁ గు స్తరింప
సొగసునూర్యపటంపుసురివాలు మైతళుకు
హొంబట్టుదట్టిపై నొలగింపఁ

గీ. జేతివజ్రంపుఁబిడితోడిచిక్కటారి
చాయ వలెవాలుదుప్పటిసంకు దోఁవ
రాచిలుక తేజి నెక్కెడురా తనంగఁ
జక్కఁదన ముప్పతిల్లంగ జనవిభుండు. 79

గీ. నగరు వెలువడి వేఁటసన్నాహమునకు
హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు
వేత్రహస్తులు రౌతులు వీరభటులు
బలసి యిరువంకలను జేరి కొలిచి రాఁగ. 80

సీ. మురు వైనచక్కని మొఁగముట్టు సవరించి
నవరత్నమయఖలీనం బొనర్చి
పచ్చసూర్యపటంపుఁబల్లంబు ఘటియించి
బిరుదుఁదలాడంబు నిరవుకొలిపి
చికిలిచొకాటంపుఁ బికిలి కుచ్చు లమర్చి
యపరంజిపక్కెర యలవరించి

సమకట్టుజల్లులు సమకూర్చి యిరువంక
  గొరకసింగిణిపాదుల్ గూర్చి కట్టి
గీ. పంచకము ఱొమ్ము విరివి యై పరిఘవిల్ల
మోడి శిర సెత్తుటయుఁ గల్గి మొయిలువోని
జలము తేనొప్పుపాదరసంబువంటి
యుత్తమాశ్వంబు సాహిణి యొకఁడు నిలువ. 81

ఉ. ఉక్కళి మైనమంచిమను వొప్పెడునాహయరత్న మెక్కినన్
గక్కున మేమి లేక రవగాలును జోడన యడ్డవేడము
ల్డుక్కుడువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి రా
జక్కడ వన్నె సోఁక నటు హా యనినన్ గదలెన్ జరీలునన్.

గీ. ఎనయఁ జెవిఁ బొడిగించి తోలినహయంబు
దనదువత్సంబు నేలపైఁ దాఁకినటుల
నోరిలోఁ గాళ్లు వెళ్లెడునో యనంగఁ
గంచుమించుగ ధరణి గ్రక్కదలఁ గదల. 83

గీ. అనమతురగసమారూఢుఁ డైనవిభుఁడు
కదలునప్పుడు దిక్కులు గగనతలముఁ
గప్పెఁ గెంధూళి సాంధ్యరాగంబు మించి
గదిసెఁ జేఁకట్లు చక్రంబు లొదిగ నంత. 84

క. వల లురులు బోనులు సివం
గులబండ్లును బొసఁగఁగా జిగురుగండెల డే
గల జాగిలములఁ గొని యవు
డలబలములతోడ మృగయు లరిగిరి వెంటన్. 85

క. భూభాగ నభోభాగ న
మాభోగ నిరోధి మేదురాశ్వవ్రజ రిం
ఖాభీషణఘనననినదన
మాభీలదిగంతబలసమన్వితుఁ డగుచున్. 86

మ. చని యంతం గనియెన్ బ్రమోదమున నానర్వాంకపోదారధీ
ఖని కూలంకషదానతోయఝరకృత్కాశల్యమేఘాయితా
త్యనఘాస్తోకయశోఘనుం డెదుట రుంద్రాభ్రంకషాశేషవృ
క్షనిధానావనిజాగ్రగణ్యము విరాజద్దండకారణ్యమున్. 87

మ. కని సాత్తే హరిపుండరీక సపది గ్రస్త ప్రతిశ్యక్త దం
తినికాయైణతతుల్ నిరాకులసముద్వృత్తంబులై వర్తిలన్
ఘన నిస్సాణ మృదంగ కాహళ హుడుక్కా భూరి భేరీనిగుం
భన గంభీర విజృంభణ ధ్వని కగంబంబుల్ వనిం బొల్చినన్. 88

క. సెలవిండు లెక్కవెట్టుచు
సెల విందు నృపాల యనుచుఁ జేరి కిరాతు
ల్వల కేల మ్రొక్కి చూడుము
వల కేల మెకాలఁ దోలవలె మే మునికిన్. 89

గీ. పులులఁ జట్టలు చీరి దుప్పులను శేళ్ల
నేకలమ్ములఁ గుమ్మి కూరాకు నేసి
యమరఁ జమరులఁ బట్టి పాలార్తు మిపుడు
సామి చూడుము నీబంట్లసత్తు వనుచు. 90

క. ఆరభటుల్ విలసిల్లఁగ
వీరభటుల్ గడపి రపుడు విభుకట్టెదుటన్

సైరిభముల మదవదనీ
సైరిభముల సింహశరభశార్దూలములన్. 91

సీ. జిగు రంటెనటుల వేఁ దగిలి పోనీక యీ
సింగాణి మునుఁబోతుఁ జెండివైచుఁ
గడుఁదురీఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యీ
కస్తూరి మువ్వాల గావుపట్టుఁ
దాటించి గొర్లలోఁ దోడేలు సొచ్చిన
ట్లీగబ్బి లేళ్ల నట్టిట్టు సేయుఁ
దగరుపై ఖరి దూఱి తెగువ నీసురగాలి
వేఁటవట్టినవాఁడిఁ బీఁచ మడఁచు

గీ. వని యిటులు వేఱువేఱ నాయకునియెదుటఁ
గాటుబంటుఁదనంబులు వేఁటకాండ్రు
మెచ్చి పొగడుచు మొకములమీఁద గోఁబను
లుడిగి జాగిలముల నుసికొలిపి రవుడు. 92

చ. ఒడిసెలరాతిచందమున నుర్వడి సింగిణికోల వాఱుకై
వడి లగు డాఁకటం బఱచునై ఖరి బిస్సున సాళువంబు దూ
ఱెను క్రియఁ దూఱఁ బాఱి కిటిబృందముఁ జిందఱ సేసెఁ
జెంచు ల, య్యెడరున బాపురే శుని నరేశుని మెచ్చఁగఁ జేసి
తా నన్. 93

చ. తిరమగ గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటి సేయుసారమే
యకముల నెల్లి కొట్టి నుఱుమాడుచు నొక్కవరాహ మేఁగఁ
జే, ఏకలిమి నప్పు డాయెఱుకువాండ్ర దలింపుల కేమి నడ్డ నే
యక తనయిచ్చగా సరగున న్వడివడ్డమ దేభమా యనన్. 94

వ. ఇవ్విధంబున నేకలంపుగుంపుల శునకపరంపరలు చెండాడు చున్నయెడ. 95

క. వడిఁ దేజిఁ దోలి రాజు
ర్వ్వడి డొంకెనపోటుగా నురఃస్థలి నవ్వడా
విడికిటిగోరకఁ వేయం
బిడి కిటి బి ట్టగసి బిల్లమీటునఁ బడియెన్. 96

చ. బలువిలుకాండ్రు మెచ్చ నరపాలకుఁ డేసినయాశుగం బన
ర్గళ మదనాగ కేసరిని గాఁడి రసాస్థలి దూఱఁగొత్తె నా
వలఁ దనపేరు దాల్చినవాయువుఁ గ్రోలుట యెట్లు భోగిరా
ట్కులమని నాగలోకమునకున్ బగ దీర్పఁగఁ బోవుకై వడిన్.

ఉ. భూమివరేణ్యుఁ డేయుశరముల్ పులులన్ గఱి మోవ నా
టుటల్, పై మఱి వెళ్లునత్తుగులు భాసిలె నా నవి పుండ
రీకముల్, తాము శిలీముఖంబులుఁ గదా యటు గావున
రక్తసీధువాః, ప్తోమము లాని కుత్తుకకుఁ దొట్టిన వెళ్లఁగఁ
గ్రాసెనో యనన్. 98

క. నీపాలఁ బెట్టుకొను మన
నీపాల యనుగతిఁ జేరి నెగసినలేడిన్
జేపట్టి పులిని జెఱె ద
యాపరుఁ డై రాజమౌళి కది యుక్తము కా. 99

చ. సమదగజంబుపై కుఱుకుసామజవైరికి నూటి పెట్టునా
గమకముఁ జూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వలే
కమితభయా ప్తి నోరసిలె నా నవు నేనుఁగు పోవువీథి సిం
హాము మెడగంట యెవ్వ రొరయుంగల రానెలవంక బాణమున్.

చ. అల వెనయం గజారులహృదంతరముల్ నలి నజ్జు చేసె నం
ధిలుతయి ఋక్షసంఘముల తేజము దూలిచెఁ బుండరీకమం
డలిఁ దెగటార్చె నిర్లద టడంచె నహో కరచాతురీగతుల్
విలసిల రాజు నైజగుణవిక్రమముం గొనియాడ నయ్యెడన్.

క. వాలమ్ముల దంష్ట్రాకర
వాలమ్ముల నెత్తి వైచి వాలమ్ముల వే
జాలమ్ములఁ దగిలినకిటి
జాలమ్ములు దూఁటె నింద్రజాలమ్మనఁగన్. 102

క. ఆవల చించుక వెడలిన
నావలఁ బోనీక చెంచు లవుడడ్డం బై
యావల నుఱుమాడినఁ గని
యావలను విభుండు మెచ్చి హర్షము నొందెన్. 103

చ. శ్వసనునిఘోటి ఘోటివలెఁ జంగున దాఁటి పయిం జనం
గఁ దా, రన మయి యొక్కఁ డొక్కయవరంజివరుం జిగు
రొత్తువాలువాల్, వెసఁ గొని కిన్కఁ గొంకిఁ దెగవ్రేసి
బడిన్ బడి లేటికుంటు మా, నిసివరు వంట గానఁబడ నేఁ
డనఁ గానఁ బడంగఁ జీలిచెన్. 104

క. భటుఁ డొకఁడు పందిపోటున
బొటవ్రేలికి నూటి వెట్టి పూని యదల్పన్
గిటి దూఱి ముట్టెమొనఁ బడ
నటు చిమ్మిన ఱొమ్ముఁ దాఁకి యావల వెళ్లెన్. 105

క. బొఱియలకడ నెఱియలయెడ
నెఱి యలవడఁ బొంచి శునకనికరము త్రుంచెన్

బరియలుగా మురియలుగా
నురియలుగా యన శశముల నుడుముందురులన్. 106

మ. కడసెన్ దుప్పులు డింకవేసి నెలుఁగుల్ గిట్టెన్ పులు
ల్సింగముల్, కడగొట్టెన్ మనుఁబిల్లు గంతుగొనె జింక ల్బి
ద్దదోఁగెం గిటుల్, పుడిసెన్ గాఁడెనుపోతు లేదు లిలిగెన్
ప్రగ్గెన్ వృకవ్రాతముల్, గదుత్తుల్ చిక్కె గజాళి చొక్కె
నపు డశ్వాన్ ఘనమాధూళిగన్. 107

వ. ఇవ్విధంబున భూవరేణ్యుం డయ్యరణ్యంబున ననేకమృగ
విహగఝాటంబుల నిరాఘాటంబుగా గీటడంచి యాఖేటక
విహారంబు చాలించి యెల్లెడం బెల్లుగాఁ ద్రెళ్లిన యిత్తి జింక
దుప్పి కడితి మనుఁబోతు కొండగొఱియ యేదుపంది కుం
దేలు కుఱుపోతు మొదలయిన తినుమెకంబులబొందులను
శకుంతబృందంబులను బొందుగా నొక్కకందువఁ బ్రోవు
వేయించి యందుల బులిందులు సొగయు మృగయాధి
దేవతా ప్రీతిగాఁ జేయం దగుకృత్యంబు సేయించి యెల్ల
రకును సమాంశంబుగాఁ బంచి యిప్పించి యుత్తమంబు
లగుదంతిదంతమౌక్తికనికరంబులు నికరంబు లయిన క
స్తూరీసంకుమదపంకంబులుఁ బొంకంబు లగుచమరవాలజా
లంబులు నాదిగాఁ గలసమస్తవస్తువులుఁ గైకొని పుష్ప
రసాది బహుపదార్థంబులు పాకనిపుణపాచకరచితమహిత
పిశితఖండంబు లఖండంబులుగా నేదిష్ఠభూమండలాఖండల
మండలంబులు నింపువేడుకలఁ దెచ్చి యొప్పించిన నిష్ట
మృష్టాన్నంబులు సంతుష్టిగాఁ దానును సకలజనంబులు
భుజియించి యయ్యెలమావులక్రీనీడలఁ గొండొకసేపు పరి

శ్రమంబు వాయ విశ్రమించి యంత నమ్మహానీయో త్తమ
గంధర్వుండు వరూథినీసమన్వితుం డై మంత్రిపుంగవులు
కుఱంగటం గొలిచి చనుదేరఁ గదలి ముందఱఁ గంచుకు
లెచ్చరింపఁ జెంచుల నవలోకించి పదియైదు ప్రొద్దులు
నిలిచి యువ్వనవిశేషంబులు చూడ నభిలాష యయ్యెడు
నియ్యడవి నుండ వసతియైనస్థలంబు గలదా యని యడి
గిన నయ్యాటవికు లయ్యా యిక్కడికి యోజనత్రయంబున
ఘోరకాంతారంబుఁ జొచ్చి పోవ నొక్కరమ్యస్థలంబు
గలదు తత్స్థలంబునఁ జుట్టాముడవెడల్పునం దామర
కొలంకులు శృంగారవనంబులు నెడతెగక యుండుఁ దదీ
యమధ్యస్థలంబున నసఘ్నోదకంబుల ఘనదీర్ఘిక కల దందుఁ
దొల్లి సీతారాములు విహరించుచుండు గని పెద్దలవలన
వినినార మని విన్నవించి దానికిం ద్రోవపెట్టుచుం జనఁ
జన మధ్యమార్గంబున. 108

సీ. కను మాయఁ జని సీతఁ జెనకు కాకాసురుఁ
 గనుమూయఁగాఁ బాటికొనినచోటు
తలకెక్కు వలపు నాఁ దగులు శూర్పణఖము
 క్కును జెవుల్ రాపాడుకొనినచోటు
నవరివేసం బైనచంద్రబింబము వోలె
 గుడి వ్రాసి జానకి నిడినచోటు
కుహనా మృగ నిశాటు గహనాధిదేవత
 కనురక్తి బలి యిచ్చినట్టిచోటు

గీ. గనుఁగొని విభుండు రామలక్ష్మణులు ధర్మ
సాధువులు విష్ణుమూర్తులు సంచరించి

నార లీపుణ్య మగునరణ్యానిఁ జూడఁ
గలిగె నని సంతసిలుచు నావలఁ జనంగ. 109

గీ. అరిది భావనములు పరసు లనఁగి పెనఁగి
మొనసి శాఖోపశాఖ లై యింపు మీఱి
ప్రబలి తామరతంప రై పరిఢవిల్లి
యెదుటఁ గన నయ్యె వానవాపదము లగుచు. 110

క. ఆతావు లవుడు గంధవ
తీతలనాథుండు సన్నుతించుచు బలసం
ఘాతము దిగు మని మెల్లన
నాతలి కటు పాదచారి యై చని చెంతన్. 111

సీ. మరుమావులరవం బసురుమావు లరు దైన
తానిక్రొన్ననపట్లు గ్రీవఁ దనరఁ
బ్రామానికపునిగ్గుఁ బ్రామానికపుశిలా
పట్టభంగంబులు పరిఢవిల్లఁ
గన దంబుజాత కోకనదంబులఁ జరించు
రాయంచ జక్కవ రవము లెనఁగ
నాకాశరుచిఁ గేరు నాకాశగంగతో
నీకాశమై వారి నిండి తొలఁక

గీ. మొలక తెమ్మెరకూనలు మెలఁయు నొలయు
దేవనిర్మిత మైనట్టి దిగ్గియఁ గని
దిగ్గి యగణిత విభవముల్ దేజరిలఁగ
రాజు మంత్రులుఁ దాను హర్షంబుతోడ. 112

వ. ఇవ్విధంబున నయ్యవనీవిభుం డమ్మహనీయస్థలశృంగారంబున
కత్యంతసంతుష్టాంతరంగుండై యచ్చట విశ్రమించి తత్ర

ద్విశేషంబు లప్పటప్పటికిం గనుచు వనవిహారంబు సలుపు
చున్న యెడ. 113

క. సారంగధరుఁడు లీలా
సారంగధరుండు సాధుసంస్తుత్యనయా
చారుండు ధర్మమర్మవి
చారుం డవు డుబును పోక సమ్మదలీలన్. 114

గీ. పారువంబులఁ బట్టెడి వారిఁ జేరి
యుద్ధవడి ర మ్మనిన భృత్యు లోకనిఁ బట్టి
వమగు ర క్తతి బడిబడిఁ బాఱుతెంచి
పులుఁగులను దె మ్మనుచు వారిఁ బిలువ నపుడు. 115

చ. జిలుఁ గగునాభినామములు చెంపలగందము లోరపాగలున్
వలిపపుసాలు వింతవలెవాటులు లాఁగులు రావిరేకులుం
గలిగినగుజ్జరూవములుఁ గంబడిచింపులు నీలిపాఁతలీఁ
కెలుఁ దగు పారువంపుఁబుటికల్ గొనివచ్చి కుమారుసన్నిధిన్.

క. మే లైన లకోరీ లొ
డ్డీలుం బదతీలు పల్లటీ ల్పకుక్కవలున్
జీలుం బకదార్లును గూ
కీలు ననెడుపేరులం దగిన పార్వములన్. 117

మ. వినయం బేర్పడ ముంగలన్ నిలువ నావిర్భూతకౌతూహలం
బున నారాజకుమారమన్మథుఁడు సొంపుల్ మీఱు మాధుర్యధు
ర్యనవీనస్వనగుంభనంబు మొద లౌనాయావినోదంబు లె
ల్లను వాళిన్ విని వారివారి మనవు ల్పాటించి పాలించుచున్.

క. పారావతరత్నం బని
పే రిడి బలుబిరుదు వేసి పెంచినదానిన్

గూరిచి తననరిరాజకు
మారులతోఁ బంచె మొడ్డి మాత్సర్యమునన్. 119

క. కేళివ వల యొడ్డి యొంటిం
బావురముఁ దిగిచి వడి నభంబున కెగయం
గా వైచి వ్రాలకుండఁగఁ
జే విసరుచు బెదరు పుట్టఁ జేసినయంతన్. 120

లయగ్రాహి.

పేరెములు వాఱుచు సమీరునిహుటాహుటిని
గేరడము లాడుచు మహారయముతో న
య్యారె యన మీఱి గరుదారవముచేఁ జదలు
బూరటిల మాకొలమువారిఁ గనమా యహా
కౌర యిది వింత గద రోరి యని యొంతయు న
నూరుఁడు పయిం దిరిగి సారెకును జూడన్
దూర మెగఁ బాఱుచుఁ జొకార మయి యన్నలువ
వారువముచందమునఁ బారువము మించెన్. 121

సీ. అభ్రమాతంగంబు హస్తంబులోఁ జిక్కి
కదలెడుపుండరీకం బనంగ
హరివిధు ల్వ్రాఁగఁ గందఁ బెరుగునంబరకేశు
తలవాఁకఁ దేలెడునెల యనంగ
మిన్నేటిదరులందు మేఁత లాడుచునున్న
యుచులు రాయంచ లేఁగొదమ యనఁగ
వడిఁ బోవుచో జాఱి పడునభోమణి తేరి
తెల్లనిచిన్నారిజల్లి యనఁగ

గీ. ఱెక్క లార్చుచు లకుముకిపక్కిరీతిఁ
దెలుపుచు ధరణి నే మైనఁ దెలుపుఁ గనినఁ
బెట్ట యని గమకించి చూపెట్టుకొనుచు
నుండెఁ బారువ మవ్వా దయ్యువజనంబు. 122

సీ. కంటికిఁ జే యూరగా నిల్పి కన్గొని
యున్నన్న యెంతద వ్వనెడువారు
వలిపచేల మునుంగు వైచి వేమఱు నూచి
హా కంటెఁ గంటి నే ననెడువారు
మెడలపై హస్తంబు లిడి తప్ప కీక్షించి
యారార మిక్కిలి పొడ వనెడివారు
వల్లెంపునీటిలోపలినీడ పరికించి
కనిపింప దేచాయ ననెడువారు

గీ. గొబ్బుగొబ్బునఁ దల లెత్తి కొంద ఱందుఁ
జూడఁ జూడంగఁ బాగలు వీడి పడిన
నవ్వినోదము గని నవ్వినట్టివారు
నైరి యొడ్డిన యొడ్డనివారు మెఱయ. 123

క. మినుకు మిను కనెడి మింటన్
బానపాన నలతెల్లమబ్బుపొంతన దిగువా
టున నదె కలదో లేదో
యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా. 124

గీ. అనినఁ జెలికాండ్ర పలుకు కతఁ డాలకించి
కించి దుపహాసమున విలోకించి గంటిఁ
గంటి నా నాను నే ముందుఁ గంటి ననుచు
ననుచు మదిఁ దాని మరలింతు ననుచుఁ దలఁచి. 125

ఉ. పెట్టను బట్టి తెక్క వెలుపించి కనంబడునట్లుగాఁగ న
ట్టిట్టొకరెండుమాటులు పయిం సురటించబలెఁ జేతఁద్రిప్పుచుం
బిట్టుగఁ గేక వేసి వినఁ బిల్చిన వెండి గరంగి ముద్ద యై
న ట్టిరుతెక్కలుం ముడిఁచి యబ్బురపుంబలునిబ్బరంబునన్.

సీ. సౌధ కేతన పటాంచల వాత ధూత ని
 ర్గత గాంగ డిండీర ఖండ మనఁగ
సితమాని పూర్వావసిత భూ పునర్దిదృ
 క్షాగ తేంద్రాగ లతాంత మనఁగ
నవహార సంఘట్టన గ్రస్త పతయాళు
 గగనలక్ష్మీ మౌక్తికం బనంగ
మధ్యంది నానంతమణి లూన మందేహ
 నంత్యక్త బిరుదైక శంఖ మనఁగఁ

గీ. బంకరుహాసంభవ కళత్ర పత్త్రి పుత్త్రి
సురకులధురీణ కంఖాణ కరి కృపాణ
రమ్య ధావళ్య జైత్ర పారావతంబు
రాఁ దొడఁగెఁ జుక్క డిగి వడ్డ క్రమము దోఁప. 127

గీ. అంతలోనని చిత్రాంగి యది మొఱింగి
క్రీడ సలుపుచు బంగారుమేడమీఁద
ములకవన్నెలు చిలుకురాచిలుకఁ బట్టి
చిలుకపలుకుల నటు చూపి పిలిచె నంత. 128

మ. కని చిల్కం దనపెంటిగాఁ దలఁచి యాకైలాటపుంబుల్గు గ్ర
కుక్కన మి న్నందినమేడమీఁదికిఁ దళుకుక్కంగాంతితో జాతి వి
చ్చినతెక్కల్ పయిఁడందె మ్రోఁతలు దగం జిత్రాంగి

రత్నాంగినం, దనుఁ గారింపఁగ వచ్చినట్టివిధియో నా వచ్చి
వ్రాలెఁ దమిన్. 129

చ. కిలఁకుల నిట్లు వ్రాల వలకేలను మెల్లనఁ బట్టి దువ్వి యా
వలినదళాక్షి పక్షి యనునామము దీనికి చెల్లుఁ బిల్చియుం
బిలువక మున్న వచ్చె నిఱుప్రేమ దొలంకఁగ నింక దీనిచేఁ
గలుగునిజంబుగాఁ దనకుఁ గాంతులుదీఱ సుఖంబుచెందఁగన్.

గీ. సందియము లే దొకింతయు నిందు కిపుడు
వచ్చు సారంగధరుఁ డిందు వచ్చునపుడె
తగులు నాచేత ననుచు సంతసము నొంది
మేడ దిగి వచ్చి యవ్వా డామెఱుఁగుఁబోఁడి. 131

శా. బంగారాన మెఱుంగు వెట్టినగతిం బైపై గుబాళించు లేఁ
జెంగల్వం గడుఁ దావి గట్టినటులన్ జిన్నారిజాబిల్లిమీఁ
దం గన్పట్ట సుధారసం బిడుక్రియన్ దన్మోహనాంగంబునన్
సింగారించె వధూటికామణి మణిశ్రేణీపరిష్కారముల్. 132

వ. ఇవ్విధంబున బహువిధాభరణభూషిత యై యయ్యేడ. 133

సీ. రవికె గట్టి తగఁ గర్ణమహనీయవిభవంబు
తాటంకములమీఁదితగులు గల్గి
యచలాయతనితంబ మతిశయిల్లి చెలంగఁ
గాంచి వజ్రప్రభాకలనఁ దనరి
కృశమై కవును పేదఱికము వాయక యొప్పఁ
బ్రణుతింపఁ దగు నీవి పరిఢవిల్లి
యలరారె మి న్నంది యరుణకరంబులు
ఘనకంకణములతో నసఁగి పెనఁగి

గీ. యాకార యద్భుతశృంగార మభినుతింపఁ
దరమె నానన కులుకు కుంగనవుబొమ్మ
కలికియా పైనరత్నమో కాక యల్ల
మోహినియొ నాఁగఁ జిత్రాంగి మురువెసంగి. 134

క. ప్రియ మై రమణీయ మణీ
మయ మై యతిచిత్రభిత్తిమంజిమ నయ మై
నయ మైనచిలుకపలుకుల
నయగారమునం జెలంగిన యగారమునన్. 135

క. వెయ్యాటులు తనయుడిగవు
టొయ్యారులు గొలువఁ జెలువ మొలుకఁగఁ గొలువై
గయ్యాళి చిలుక తేజీ
వయ్యాళి పిసాళి కూలిచెల నున్నంతన్. 136

మ. సరసాగ్రేసర వాసరప్రభుతనూజస్థూలలక్షాపురం
దరజిద్భోగధురంధరా భరతశాస్త్రప్రౌఢమార్గైకలా
స్వరసోత్పాదనకోవిదా శ్రవణభూషాదివ్యరత్నప్రభా
తరణిశ్రీకరగల్లభా విభవభృత్తంజాపురీవల్లభా. 137

క. తరుణీమన్మథ యాశ్రిత
భరణగుణాభరణశౌర్య బహురాజ్యధురం
ధర సత్యాదిమచక్రే
శ్వర యభినవభోజరాజవరబిరుదాంకా. 138

తోటకము.—

అతులాగమశాస్త్రనిరస్తనురే
జ్య తులాధికవిద్వదవాప్తశత

క్రతులాభ శుభోదయ కారణర
త్నతులాపురుషాదిక దానచణా. 139

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ ప్రసిద్ధవాగ్వైభవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# సా రం గ ధ ర చ రి త్ర ము

## ద్వి తీ యా శ్వా స ము.

---



జానకీమనోహర
పూజాంచిత హృత్సరోజ షోషాఖిలది
గ్రాజ సకలార్థిజనని
ర్వ్యాజకృపా యచ్యుతేంద్రరఘునాథనృపా. 1

వ. అవధరింపుము. 2

క. ఆరీతిఁ బారువము పో
సారంగధరుండు తోడిజననాథసుతుల్
సారెకుఁ గేకలు వేయఁగఁ
గారాకూర మయి మనసు కళవళపడఁగన్. 3

ఉ. బెంగ లిడంగ గెంటి యటఁ బెంటిని గానక దేలిపోయి చి
త్రాంగి విచిత్రరత్న భవనాంగణసీమను దేల వ్రాలె నా
బంగరుముద్దుఁబావురము బావురె యంతిపురంబులోని కే
భంగుల నన్యుల న్వెదకఁ బంపఁగరా దిఁక నేమి సేయుదున్.

గీ. తామసము సేయఁ దగ దింక దీమసమున
నేరుపరి నై ననేఁ బోక తీర దనుచుఁ

బోవ మతిమంతుసుతుఁడు సుబుద్ధి దీర్ఘ
దర్శి గావున సారంగధరున కనిమె. 5

ఉ. మన్నన చేసి మీరు బహుమానముతో నను నేలినారు నేఁ
గన్నది తెల్పకుండిన నఘం బగుఁ గా దని వెగ్గలింప కీ
విన్నప మాలకింపుము వివేకివి గాని మహోఁదు గావు నీ
కెన్నఁడు లేసిరోజ యిది యే మటుఁ బోయిన హాని
యయ్యెడున్. 6

ఉ. రా జొకఁ డూర లేఁడు చెలి ప్రాయఁపుబిత్తరి నీవు రూవరే
ఖాజితమన్మథుండ వటు కావునఁ బోఁ దగదయ్య నీకు నో
రాజకుమార యొక్కఁడివరా కిటు నూడఁ గదయ్య భామినీ
రాజులచిత్తము ల్దెలియ రా దెటుబో యెటువచ్చునో కదా. 7

క. వలపు నట పాపులా నహి
యలనత్యము నున్న శలఁపు లభ్రచ్ఛాయల్
తలఁ దడవి బాస చేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా. 8

గీ. వయసువాఁడును మిగుల బా గయినవాఁడు
వన్నిట నొయారి యై యుండునట్టివాఁడు
దైవగతి నొంటిపాటునఁ దగిలెనేని
యోజ చెడి పైకొనదె యెట్టియువిద యైన. 9

వ. అది య టుండ నిమ్ము. 10

ఉ. ఇంతులచూపు నాటుకొను టెం తరుదే మగవారిచిత్త
ముల, గాంతలకన్నుసన్నని మెలంగుఁ గదా మరునంబ
కంబు లా, ద్యంతము లెంచి చూడ జవరాంద్రయెడాట

ములందు శక్యమే, యెంతటివాని కైనఁ జలియింపక
బిగ్గ మనంబు నిల్వఁగన్. 11

ఆ. నిజము భీష్మునంతటిజితేంద్రియున కైన
నాశ పుట్టు మది నిరాశ పుట్ట
దితరు లనఁగ నెంత యేకాంత మైయున్న
ధనముపట్ల యువతిజనముపట్ల. 12

క. వినమే తొల్లిటి తపసుల
వనితలకుఁ లోను గానివారలు గలరే
మన మనఁగ నెంత గరఁగక
మన మనఁగా నెంత కలికి మటుమాయలకున్. 13

చ. గుఱుతుగ స్త్రీలకుఁ మగలకుఁ మది నిల్కడ లెందు లేవు నీ
వెఱుఁగనినీతియుం గలదె యేటికిఁ దత్తఱపాటు మీఁదఱి
త్తెఱుఁగవు నీవివేక మెపు డెక్కడఁ బోయె విచారహీనతఁ
గఱటితనంబునఁ బదరి కార్యము సేసిన మెత్తురే జనుల్ 14

చ. నృపతికుమార లోకమున నీసరి చక్కనివారు లేరు నీ
విపు డటు పోయినప్పుడె పయింబడి ని న్వలవంతఁ బట్టు వ
చ్చపలమృగాక్షి నీ వది పొసంగక వచ్చితి వేని రాజుతోఁ
గపటముగాఁగఁ జెప్పి నినుఁ గల్లరిఁ జేయుఁ జుమీ నిజంబుగఁ.

క. తల గలిగినఁ గుళ్లాయులు
గల వేవగ నైన నీవు గలిగినఁ దాదృ
క్కలరవము లెన్ని యైనఁ
గలిగెడుఁ బోకు మని యడ్డఁ గా శ్వేయంగన్. 16

క. కోపమునఁ జూచి యవుడా
భూపాలకుమారుఁ డను సుబుద్ధికి నానా
పోపా మ్మూరక వలవని
పాపము గట్టెదవు చాలుఁ బదివే ల్వచ్చెన్. 17

చ. అరమర లేక నీ వహరహంబును మచ్చికఁ గూడి మాడిమున్
వెరిఁగిన మందమేలమున భీతిల కంటివి గాక యిట్టు లొం
డొరు లని పోవ నోవుదు రఁటోయి ప్రధానికుమార నేఁడు ని
ష్ఠురతర ఘోరపాతకపుసుద్దులు నీవలనన్ వినంబడెన్. 18

ఉ. ఎక్కడిసుద్దు లయ్యె యివి యెవ్వరి కైననుఁ జెల్లుఁ గా కిలం
దక్కినయోజ లావిమలతామరసాక్షికిఁ గల్గ నేర్చునే
యక్కట తప్పి దారి యటు లైనను నా హృదయాంబుజాత
మా, దిక్కునఁ జిక్కనే పరసతీవిముఖం బని నీ వెఱుంగవే.

క. ఆదేవి యొక్కటియు మఱి
యీదేవియు నొక్కటియని యిద్దఱు నాకున్
గాదిలితల్లులు గారే
భేదంబులు గలవె తల్లిబిడ్డల కెందున్. 20

క. ఆమె యఁట నన్ను బలిమిన్
గామించు నఁట యొడఁబడక క్రమ్మఱి నే రా
సామికి వెగటుగ నను నఁట
యీమాటకె యాజ్ఞ పెట్టు నఁట విభుఁ డహహా. 21

ఉ. ఆయమ పాతకం బని భయంపడ కూరక యేల నావ
యిన్, మాయలు పన్ని భూవరుమనంబుఁ గలంగఁగఁ జే
యుఁ జేసెఁ బో, యాయన యేల పుత్త్రుఁ డని యాత్మఁ

దలంపక నొంచు నాయె న్నా,-శే యిది వట్టిశంక వని లే దిటు
వంటివె నీతిమార్గముల్. 22

క. నామదికిఁ నరి పో దిది
యేమి యవశ్యంబు పోదు నిప్పుడ దత్తుఁ
నాముద్దుఁ బావురము నని
భూమీవరసుతుఁడు గడచి పో నతఁ డనియెన్. 23

ఆ. ఈ సుబుద్ధిమాట లెంతలే యని పోయె
దీసు బుద్ధి నిడుఁ జుమీ లతాంగి
నిలు వరాకు మాని తలపోసి చూడుమా
నిలువ రాకు మనుచు నలుగ నేల. 24

గీ. నిన్నుఁ జూచిన నెటువంటి నెలఁత కైన
మనసు గరఁగక యుండునా మనుజనాథ
యల్లచిత్రాంగి తల్లి నా కనియె దకట
వారకాంతల కింద్రైన వావి గలదె. 25

క. ఏకాంత నైనఁ బురుషుం
డేకాంతమునందుఁ జేర నేనియు నతనికిఁ
లోకాపవాద మంటద
చీకాకుగ ధైర్య మెడలఁ జేయఁడ మరుఁడున్. 26

క. వేగ నరేంద్రుఁడు రాకే
బాగా యిటు చనఁగ వాఁడిపలుమొన సోఁకిఁ
భోగంబున నిను మెదుపడె
భోగిని మైనపుడు చేరఁ బోరాదు సుమీ. 27

ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహింపక రాజు
తనయుఁ డనుచుఁ దప్పు తాళి వీఁడఁడు

తండ్రి సేయునాజ్ఞ తాళెద నంటివా
నింద నిజము గాఁగ నిలుచు నీకు. 28

గీ. చదువుకొంటివి నీతిశాస్త్రంబు లెల్ల
నీ వెఱుంగనిమేరలు లేవు జగతి
నైనఁ దెలిపితి నీకున నయ్య యింక
ధాత వ్రాసినవ్రాఁతకుఁ దప్పు గలదె. 29

క. ఈ రాసుతుసమ్ముఖమునఁ
జేరి యెవరు బుద్ధిమతులు చెప్పెడివారల్
లే రై రాయని పెద్దలు
దూరుదు రటు గాన నళుకుతో ననవలసెన్. 30

క. నావలనఁ గొదువ లే దిఁక
దేవరకును విన్నవించితిని మీఁది వృత్తం
బీవిధముఁ దెలుపకున్న ధ
రావరసుత మీ రెఱుంగరా సర్వజ్ఞుల్. 31

క. అనిన నగి యెందుఁ గలదే
మన నెఱుఁగనికలయు నొడలు మఱచినసినముఁ
కని దేలా మనసునకుఁ
మననే తార్కాణ మని కుమారుఁడు వేగన్. 32

క. వల దన్న మాన కరిగెఁ
జలమునఁ దనపాలివిధి వెనఁ గొనిపోవఁ
దొలుజన్మంబునఁ జేసిన
కొలయును బుణ్యంబు కట్టి కుడువక యున్నె. 33

క. చనుచో వాకిటి పెద్దలు
గని దిగ్గున లేచి రాజుగా రిట లేరే

యని కొందుకుచు నన లేకుం
డిన నే మాయె నని మందటిలఁ బల్కె తగన్. 34

సీ. సికపుప్వొత్తుఁదావికి వెంటఁ బడు తేంట్ల
ఝంకృతి మాగధ స్తవము గాఁగ
గడిఁది రాయకుమార గండపెండేరంపు
రవళి కంచుకిలోక రవము గాఁగ
తల చుట్టి వచ్చుదృగ్గాళధళ్యప్రభ
లిరువంక వేయుచామరలు గాఁగ
నలుదెస లిమ్ముఖమిట్లు గొంబవు దేహచ్ఛాయ
తలఁగఁ ద్రోయఁగ రానిబలము గాఁగ
గీ. రాజసంబునఁ గక్ష్యాంతరములు గడచి
యరిగె నవుడు జగన్మోహనాంగవిజిత
రాజరాజకుమారసారంగధరుఁడు
రాజరాజకుమారసారంగధరుఁడు. 35

గీ. అంత నొకకాంత యరుదెంచి యతనిఁ గాంచి
నరగఁ జని యమ్మ సారంగధరుఁడు వచ్చు
చున్నవాఁ డని దెలుప నయ్యుత్పలాక్షి
కోర్కె లీడేఱె నని మెచ్చుకొనుచు నవుడు. 36

ఉ. కంతుఁడొ కాక యారజనికాంతుఁడొ లేక జయంతుఁడో
యితం, డెంతవిలాస మెంతకళ యెంతరయోయార మటంచు
విస్మయా, క్రాంతమనంబుతో సపులక స్తని యై కనుఱెప్ప
వేయక, కాంత మహాభిలాషఁ దటకావడి చూచెఁ
గుమారశేఖరున్. 37

చ. ఊరుకుచడంద మెంతమృదువో మఱి తియ్యనితుంటవింటనే
విరవిరఁ బోవునారిఁ గొని పెన్నఱిగొజ్జెఁగతూవుచేత న
చ్చెరువుగఁ బొంచి కంటికి దిసింపనివాఁ డవు డేసి యార్చెఁ
బో, సురసుర స్రుక్క మెత్త నగుచోటన గుద్దలి వాఁడి
యౌఁ గదా. 38

క. ఇంతంత గానితమి న
కాంతామణి యట్టు లతని గనుఁగొని మణిపీ
ఠాంతరము డిగ్గి యతఁడ
ల్లంతట రా హర్షమగ్న యై తనలోనన్. 39

క. సారంగనయన తనమన
సారంగను గౌఁగిలించి యులరఁగ నపుడా
సారంగధరునిఁ జూర్చెఁడి
సారంగధరుం డటంచు సారెం గలఁగున్. 40

ఆ. ఔర వీనిమోహనాకారరేఖ వే
మాఱు మారు హరికుమారు మాఱు
వెల్లదమ్మితొగల వీనికన్నోయితీ
రేవు మావు బావు రేవు మావు. 41

సీ. చక్కఁగా సోగ యై ముక్కు నోటేరు పె
ట్టినరీతి సంపెంగమొక్క దెగడ
లచ్చియున్నకుఁ దమ్ములకును వాదులు పెట్టి
కళకళ నగుమోము కళల నీన
కండము ల్దిరిగి బల్గొండలు దాపించి
నటువలె నిగుబుజా లతిశయిల్లఁ

గమ్మిఁ దీసినలీలఁ గనుపట్టునెమ్మేని
మిసమిస ల్కడు మిఱుమిట్లు గొనఁగ
గీ. నడుగులబెడంగు నంచల నాన గొల్పఁ
జెలఁగి యమ్మక్క యొక్క యొచ్చెమ్ము లేక
నిలువునీరునఁ బండిన ట్లలరినాఁడు
వేయిఁ గన్నులు వలయుఁ బో వీనిఁ జూడ. 42

ఉ. తీరుగ మల్చివేసినగతిన్ దొడ లున్నవి యొమ్ములోనివి
స్తారము చెప్పరాదు బలుదఱ్పు నదల్పును బాలు గాఱు
నా, రార మొగమ్ముచక్కఁదన మన్నియ యుండఁగ నిమ్ము
వీని యొయ్యారమె లతుసేయు నహాహా యనుచున్ దల
యూఁచు సారెకున్. 43

క. ఇవ్విధమున నే నీతని
జవ్వన మిపు డవహరింతు నరగ నని మనం
బువ్విళ్లూరఁగ వెనుకన్
బువ్విలుదొర కలువతూపు మొన దీడంగన్. 44

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁ డిటువంటివాని నే
నెక్కడఁ జూచి కాన జగతీశ్వర చిత్తరువందు వ్రాయ రా
దిక్కమనీయరూప మొకయింతయుభాగ్యముగాదె యొచ్చెము
ల్దక్కినకూర్మి నా కితఁడు దక్కినఁ దక్కినమాట లేటికిన్. 45

చ. వలపు దువాళి సేయఁ బికవాణి కదంబపుఁగమ్మవాసనల్
కులుకుఁ బయోధరంపుమెఱుఁగుల్ హృదయంబున నాటు
నంబకం, బులబెడిదంపువాఁడితనమున్ గనిపింపఁగ జాఱు
పైఁటతో, సొలపుఁ బిసాళి వాలుఁదెలిచూపులతో దమ
కంబుతోడుతన్. 46

సీ. యూఁకంత గాని లే దేకై వడి సమంబు
వచ్చు బంగారు మైహెచ్చుజిగికి
గోరంత గాని లే దేరీతిఁ బ్రతి వచ్చు
యావరక్తిమ మించు మోవిరుచికి
నిసుమంత గాని లే దెటువలె నెన వచ్చు
సైకతంబు విశాలజఘనమునకుఁ
గంటిలోఁ బడినంత గాని లే దెటు లీడు
వచ్చు కాటుక కప్పువాల్కురులకు
గీ. ననుచు నఖిలాంగశృంగార మభినుతించు
గతిఁ దులాకోటి మణికోటి కాంచిదామ
కింకిణీగణ కంకణాకీర్ణ కలిత
లారవమ్ములు గులుక నొయ్యార మొలుక. 47

గీ. ఇంద్రనందనుఁ గాంచి మోహించి వచ్చు
నుర్వశి తెఱంగు దోఁప నయ్యుర్వసితన
మోదకచ పాకశాసని యొఱపు నెరవు
నక్కుమారునిఁ గని చేర నరుగుదేర. 48

గీ. అవుడు మంజీరకలకలం బాలకించి
వలదు వల దన్న గతి దోఁపఁ బలికి పెనఁగు
నంచగమిఁ గాళ్ళఁ ద్రోచి యేతెంచె శకున
మడ్డగించినవని సేయ నగునె యెందు. 49

క. తనుఁ గన్నవారి నామడఁ
ను మన్నది తేటపడఁగఁ గడువేడుకతోఁ
బినతల్లికి నెదురుగ వే
చని యవుడిం పెనయ వినయసంభ్రమపరుఁడై. 50

ఆ. రాజు లేనివేళ రాఁ జెల్ల దిందు నా
వలనఁ దప్పు గలదు లలన నైఁపు
మనుచు మనుచు వేఁడుకొనురీతి మ్రొక్కసా
రంగధరున కనుఁ గురంగనయన. 51

క. వసుధేశుఁడు నీవును నా
కక్కసమం బని మదిఁ దలంపఁగా నాకు నసో
యనమాంబకుండ వయ్యుం
బొసఁగున తొడిఁబడఁ బ్రాణామ్ముఁ ఘటియింపన్. 52

గీ. అని సుశీలయుబలె నా గయాళిజంత
చేయి చూపి ముందఱగ విచ్చేయు మనుచు
నయ్యనఘుఁ దోడుకొని యేఁగె నతివినయము
ధూర్తలక్షణ మని మదిఁ దోఁప నపుడు. 53

క. గంబూర గులికి యనురా
గం బూర మనంబు చల్లఁగాఁ బన్నిటన్
బింబోష్ఠి యతనిపాదా
బ్జంబులు గడిగించెఁ గూర్మి నకియలచేతన్. 54

చ. జనవరసూనుఁ డందులకుఁ జాలఁ బ్రియంబు చెలంక నన్నులం
తను గని నీ కుమారుఁడఁ గదా యిటు తక్కిన వారికి న్నలెన్
జననిరొ నాకు నింతయుపచారము సేయఁగ నేటి కమ్మ నేఁ
డనవుడు నాకు మారుఁడవె యాటను జేయుదు నంచు నేర్పునన్.

క. పర్చినబలుమానికములు
నేర్చినయొక జాళువాపసిఁడిగద్దియపైఁ

గూర్చుండఁబెట్టి వినయము
గూర్చి నృపాలసుతుఁ గూర్చి గూర్చి పొసంగన్. 56

గీ. తలిరుఁగెమ్మోవిఁ జిఱునవ్వు మొలక లెత్త
నలరుకమ్మనివాసనల్ గులకరింపఁ
గెలనఁ దియ్యని తేనెలు చిలుకుచుండఁ
గలికిలతకూన యాకొమ్మ పలికె నపుడు. 57

ఉ. నీసుగుణత్వమున్ జెలువు నేర్పును నెచ్చెలులెల్లఁ జెప్పఁగా
వీనరవోనిమోహమున వీనులవిందుగ విందు నవ్వరే
ఖాసుమకాండ నేఁడు పొడగంటిని గన్నులపండువయ్యె నేఁ
జేసినభాగ్య మెవ్వరును జేయరయారె ఫలించెఁ గోరికల్. 58

ఉ. చందురునిన్ జయంతుని వసంతునిఁ గంతుని నాదిగా జనుల్
కొందఱు మోహనాంగు లనుకో విని పోవుటెకాక చూడ లే
దెందును వారిరూప మదియెట్టిదయో యిదె నిన్నుఁగంటి నా
నందము గాఁగ నేఁడు సుదినంబుగ నావదనంబు రంజిలెన్. 59

ఉ. తొల్లి మనంబులోఁ గలుగుతుందుడుకెల్లను బాసెఁ గామినీ
హల్లకబాణ యెంతవని కైన నిధానము నీవు గల్గ నే
నల్లవిభుండు రాఁ డని మహాపరితాపము నొంది యేల చిం
తిల్లఁగ వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁగన్. 60

క. ననుఁ జూడరాఁ డదేమో
యని నిను దూరికొనుచుందు ననయము నాపై
నెనరు గలందుకు గుఱు తిదె
కనిపించెను మనము వేడుకలు గనఁ గల్గెన్. 61

ఉ. నాయపరంజిమేడ యొకనాఁడునుఁ జూడవుగా యగోచరం
బౌ యురుమంజిముత్తియపుటన్నువసోరణగండ్లయంద మా

చాయల కెంపుటోవరుల చందము నా చలువ ల్దొలంకుకే
రాయల రా యరంగులనరాగము నామణికుడ్యభాగముల్.

ఉ. అందు వినోదమార్గములు నందు విశేషము లందు హర్మ్య
లిం, పొందఁగఁ జూచి మానికపు టోవరిలో సొగసు ల్న
టింపఁగా, గందము వక్కలాకులును గైకొని వేడ్క నొ
కింతసేపు నీ, వందుల విశ్రమించి చనుమా చనుమాన
ముతోడ నావుడున్. 63

చ. వెడనగ వంకురింపఁ బృథివీవరనూనుఁడు వల్కె నవ్వొ డ
వ్వడఁతుకతోడ నా కివుడు ప్రాణపదం బగుపావురంబు పైఁ
గడుఁ బొడవేఁగి పెంటిఁ బొడగానక యిచ్చట వ్రాలె దాని వెం
బడిఁ బడి రాజు లేనియెడ మాపినతల్లివి నీవు గావునన్.

చ. రవి శశి రశ్మికిన్ జొరఁగరాని భయానక మైన నీమణీ
భవనము వచ్చి సొచ్చి పదపంకజము ల్గని మ్రొక్కఁగంటి నీ
దవుకరుణావిశేషమున నన్నియు నున్నవి యేటి కమ్మ పా
రువము నొసంగు పోయెద సరోరుహలోచన యన్న
నవ్వుచున్. 65

క. పోయెదు గా కివు డే మని
యాయనచెయివట్టి వట్టియానల నవు డా
గాయకపుజంత చెంతం
బాయకఁ దోడుకొని మేడపయికిం జనియెన్. 66

ఉ. పాయని మోహతాపమున భామిని యుండఁగ నందు
మీఁద నేఁ, డీయెడ హాని వచ్చు నని యెంచక నూరక
పిట్టరేఁపుచే, నీయన కన్నుఁ గాన కివు డిచ్చట వచ్చెనె

యమ్మచెల్ల యే, మో యిది కారణం బనుచు నూహాలు
సేయుచుఁ బ్రోడచేడియల్. 67

ఆ. తత్తఱింపఁ దొణఁగి యిత్తఱి నిది యేమొ
నూటి గాదు తలఁపఁ బాటి గాదు
తగదు మాను మన్నఁ బగవార మగుదు మి
క్కటికిమనము పులినకటికి మనము. 68

క. అటు గనుక నీవొ చెప్పిన
యటువలె నియ్యకొని లియ్య మై యుండంగా
నటుమీఁద దైవ గతి యని
యటు నిటు నడయాడుచుండి రా చెలు లంతన్. 69

సీ. నిశ్శ్రేణి శోణమణిశ్రేణి కాంతులఁ
జరణాబ్జరాగంబు శిరము దన్న
జాతరూప కవాట జాత రూప స్ఫూర్తి
నంగవల్లిచ్ఛాయ యవలఁ ద్రోయ
జాల మౌక్తిక వజ్ర జాల మంజుద్యుతిఁ
గనుదోయి జిగి మోరగంటఁ జూడ
న స్తంభ నీలమయ స్తంభ రుచితోడ
నెఱికొప్పుఁగప్పుడా లొరసికొనఁగ

గీ. నవ్విలాసిని యతిమనోహరము లైన
చవికె లరఁగులు పాకలు చప్పరములు
నాది యైన విశేషమ్ము లన్ని యతని
కెచ్చరించుచు మేడపై కేఁగునపుడు. 70

గీ. చంద్రకాంత వితర్దికా సాంద్ర కాంతి
యింద్రనీల మయ స్తంభ రుంద్రదీప్తి

రెండుఁ బెనఁగొని యురు దొనరించె మదికి
గంగ యమునయుఁ గూడినభంగి మెఱసి. 71

ఉ. నాయక మైనకెంపుగమి నాటినచోటులు సాంధ్యరాగమున్
జేయఁగ నింద్రనీలములచెక్కడపుంబనిచక్కి యంధకా
రాయితమై వెలుంగ మకరా లమరించినపట్లు వెన్నెలల్
గాయఁగ మువ్వెలుంగులకుఁ గందువయో యన మించె
నందులన్. 72

చ. పరిమళపేటు లారజవ్వుఁబల్కులచిల్కలుఁ బొరువంపుఁ బం
జరములుఁ దూఁగుటుయ్యెలలుఁ జప్పరమంచము లించు తా
విపూ, సరములు ధూపవాసనలసంభ్రమముల్ గల కేళి
రత్నమం, దిరముల నక్కుమారుని మణిమయవేదిక నిల్పి
చెంగటన్. 73

ఉ. ఏకడఁ జూచినన్ రతుల కేఁకట తీరఁగ వ్రాసినట్టి కో
క్కోకకళారహస్యములు గోప్యము లౌచవుసీతిబంధముల్
నాకపురీ విలాస కలనా గణికామణి కాముకాది నా
నాకృతులున్ విచిత్రగతు లచ్చట నచ్చపలాక్షి చూపుచున్.

ఉ. ఈ విటు లెన్న చూచితె మహిన్నిజజాణవు వల్లవీకుచే
ష్టావిరతానురాగయుతుఁడై తగ నెయ్యపుటాలమందలో
నావగ లెల్ల నక్కలికి యారసి గైకొని యున్కి నో వయో
హావకళాభిరామ జలజాంబక కేళివినోదవైఖరిన్. 75

క. ఒకఁ డూరువ్వూనఁ జెలి యం
దుకె జం కెనయుంగఁ జూడఁ దా మఱికటిసీ
మకుఁ బెనఁగుడు 'గ్రామో నా
స్తి కుత స్సీమా' యటంట సిద్ధం బయ్యెన్. 76

క. అనుచు విటీవిటసంఘము
కనఁబడ గోపాలుఁ జూపి కడు నేర్పుగ నా
డిన సరసవాక్యములు విని
వినములు చేసికొనఁ దెలియ విను మని పల్కెన్. 77

ఉ. అల్లన గాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన గమకించుట గంటివె రాకుమార యా
నల్ల నగాధిరాజసుతుఁ డర్మిలి మేనక ము ద్దొనర్ప రా
గిల్లి కుచంబు లాన గమకించుట బాల్యము గాదె మానినీ.

మ. వలనొక్కు ల్నిగుడన్ గళ ల్వెలయఁగాఁ బైపైఁ జెమర్పన్
సము, త్కలికల్ పెంపు దగం జెనంగి యలసత్వం బొప్ప
నం దీక విం, తలు గా నుండుటఁ గంటివా రతివినోదప్రౌఢి
రాచూలి యాఁ, దలిగుంబోఁడిరో కంటి వా రతివినోద
ప్రౌఢిజె ల్లాఁ గదా. 79

ఉ. నిక్కగఁ జూడు చిత్ర మిది నెమ్మది వేడుక నోలలాడు న
మ్మక్కలగుట్టు బట్టబయ లై గనిపింపఁగ శౌరి పొన్నపై
నెక్కిరమించు చున్కి యవునేమగువా యిది చిత్రమౌట తా
నిక్కము కృష్ణలీల గద నీ విపు డెన్నినమార్గ మంతయున్.

క. అని యిటు లతఁ డాకామిని
యనువాక్యము లెల్ల వేఱె యర్థముగా నే
ర్పున విఱిచి మాట లాడిన
మన నేమియు విఱుగ కపుడు మదవతి కఁడఁకన్. 81

క. పసిఁడికదంబము మంజుల
వసనకదంబము ననర్ఘ వరమణిభూషా

విసరంబులు విరినత్తా
విసరంబులు దిగిచి వలపు వెలి విసరంగన్. 82

క. ఓయి నెఱజాణ తలకోనఁ
జేయుము విరు లివె జవాది చెయిఁ బట్టుము వా
లాయము మెదఁ జేర్పు కలపము
కో యని యీఁగాని మరుఁడు కో యని యార్చెన్. 83

గీ. మంచిమేలైన దిదిగోఁ గొమ్మంచుఁ గప్పు
రంబు సగపాలు నించి వీడెం బొసంగి
పూనుమీ మెయి భోగంబు భూషణంబు
లెసఁగ నీ వని యాటాఁగ రొసఁగ రాఁగ. 84

మ. అవి చేనంటి చెనంటిఁ జూచి యతఁ డిట్లన్ దల్లిదండ్రుల్
మనల, బు విరాజిల్లఁగఁ గూడఁ బెట్టినధనంబుల్ లోకమం
దున్ గొమ్మా, కృపిగా కెవ్వరి నమ్మ కావలయు వేళన్ వచ్చి
కొంపోను నేఁ, డివి నీపెట్టియ నాదుదాఁపురముగా నిం
దుండ ని మ్మన్నియున్. 85

క. అని ప్రియము గడలొక్కనఁ బ
ల్కిన నంతయు హావభావలీలాగతులన్
దనచతురోక్తులచే నా
యన మది మేకొలుప లేక వ్యాకులమతి యై. 86

ఉ. ఆతరళాక్షి డెందమున నారట మొందుచు నేమి సేయుదున్
రాతికిఁ దోడు వోయినది రానుతుఁ డెందము మెత్తగాదు దా
దాతికి వచ్చి యుండ నిఁకఁ దాళిమి చెల్లునె మారుఁ డంటినా
ఘాతకుఁ డోర్వ రాదు సముఖంబున నేటికి రాయబారముల్.

మ. అని యూహించుచు లజ్జఁ బో విడిచి యేకాంతంబుగా నర్ధి
న, ల్గనుచున్ బైఁట దొలంగ నీవి వదలన్ గామాంధకారం
బు నె, మ్మనమున్ గప్పినఁ గన్ను గాన కవు డామత్తేభ
గంభీరగా, మిని యత్యంతనిరంకుశోద్ధతిని బల్మిన్ బట్టఁగాఁ
జూచినన్. 88

క. గడగడ పాపభయంబున
వడఁకుచు నిది కోటిగొడవ వచ్చె నటంచున్
వడి లేచి యతఁడు తల్లీ
తడ వాయెను వచ్చి పోయెదను నే ననుచున్. 89

క. ని న్నిదుః రెదురే నూడఁగ
నిన్నాళ్ళకు సెలవు గాఁగ నిట వచ్చితి విం
క న్నీవు తిరిగి పోయెద
వన్నన్ నేఁ బోవ నిత్తునా నవమదనా. 90

మ. అతిమోహాంబున మించుతల్లి నిట నీ కాసించియున్నా ననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి సుకుమారా రాసుతా యా
త్మజా, కృతి న న్వేడుకఁ దేల్పుమీ తలఁపఁగా నేఁటికిఁ దో
రాక్షి న, మ్మతి సారంగధరుండ వయ్యొ నలయింపన్ జెల్లునే
నావుడున్. 91

మ. అతిమోహంబున మించుతల్లి నిట నీ కాసించి యున్నాననా
రతసౌఖ్యోన్నతిఁ జెందఁ గోరి సుకుమారా రా సుతా యా
త్మజా, కృతి నన్ వేడుకఁ దేల్పు మంటివి ధరిత్రిన్ సత్య
వాణి సర,స్వతి యనాక్య మ దేల తప్పు నిజమే వాక్రుచ్చి
నా వియ్యెడన్. 92

మ. అని పోఁ గుచ్చెలు వీడ లేనడుము జవ్వాడఁ జగన్మోహన
స్తనగుచ్ఛంబులమీఁద హారములు నృత్యంబాడ లోఁ
దాల్మి యూ, డనిబాడన్ బులకాంకురంబు లొనఁగూడం
గట్టివాయింతి వే, చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాం
తుఁ బట్టఁగాఁ బోయినఁ. 93

ఉ. అంటకుమీ లతాంగి నను నంటిన నేమి మనోహరాంగ నే
నంటు పడంగ లే దనుచు నంటెదఁ గాని యు టంట గాదు న
న్నంటఁగఁ జెల్లునే జనకు నంటినపిమ్మట నంటి వైన నీ
యంటున నంటు గామి నెటు లంటును గొంటక మేనఁ బ్రాణ
ముల్. 94

క. మే లాఁడి వెట్టంగా
మేలా నిలు వోవ లేఁ జుమీ చల మేలా
మేలావరసుత తామస
మేలా రమియింపు మనుచు మీఁదఁ బడినఁ. 95

గీ. హా మహాదేవ యని చెవు లంటి కేల
వడిఁ గడకుఁ బోవ నవ్వా దవ్వనిత రణిత
మణిగణోజ్జ్వలకంకణక్వణన మొలయఁ
బట్టుదుప్పటి చేఁ జట్టి పట్టుకొనియె. 96

క. పట్టి చలపట్టి యూ రా
పట్టిని గూర్చుండఁ బెట్టి పకపక నగి యూ
కట్టేఁడి యుగుమరునకు ననుఁ
గ ట్టిడి యొప్పించి యెందుఁ గదలెద వింకఁ. 97

సీ. చూపుకన్నెతికంబు వావ మే నది మెచ్చి
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనఁగ వలదె

చెవులలో నమృతంబుఁ జిలుక నో రది మెచ్చి
తీయవాతెఱ విందు చేయవలదె
బుగబుగ వాసనల్ నిగుడంగఁ గమ్మావి
యది మెచ్చి మోము ముద్దాడ వలదె
యుల్లంబుఁ గలఁపఁగా నొయ్యార మది మెచ్చి
పొసఁగ దానికి నీవి యొసఁగ వలదె

గీ. రమ్ము సారంగధర వేగిరమ్ము మాని
కలరవమ్ముల నణకించుగళరవమ్ము
నాదు మొలనూలి గంటల నాదు వినక
చంట నీయుర మానక చంట దగునె. 98

మ. అనినం గాలినశూలము ల్చెవులలో నంటించినట్లైన నూ
నినపెందిమ్మున సొమ్మసిల్లి మగుడన్ వే తేరి యమ్మంత్రినం
దనువాక్యమ్ములు నిక్క మయ్యె నని విన్నంబోయి కన్నీళ్లుగా
ఱ నునుంజెక్కుల వాతెఱం దడుపుచున్ రాచూలి లో
జాలిగన్. 99

గీ. పులుకు పులుకునఁ జూచి యక్కలికితోడఁ
బలుకుపలుకున దైన్యంబు దొలఁకఁ బలికె
ననుఁ గనుప నోపుపినతల్లి వనుచు నమ్మి
చెల్లఁబో యిటు వచ్చిన దెల్లఁ గలిగె. 100

చ. మదిఁ దలఁపన్ వినం దగనిమాటలు నోరెటు లాడెఁ జె
ప్పఁగా, నెదిరి మనంబులోఁ దెలియఁగ కేమిటి కీవలవంతఁ
దల్లడిం, చెదు మది వావిఁ బో విడిచి చెల్లరె తల్లియ దైవ
మంచుఁ గో, విదు లన విందు నాకు వినవే పరభామలు
దోడఁబుట్టువుల్. 101

మ. వల దమ్మా యిటువంటి కానివని యోవామాక్షి యీ వెఱ్ఱి
బు, ద్ధులు నీ కేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భావ లిట్లాడి
యీ, కొల నా కేటికిఁ గట్టె దమ్మ మఱి లోకుల్ విన్న నే
మందు ర, మ్మ లఘుత్వంబుగఁ జూతురమ్మ తగ దమ్మా ధర్మ
మూహింపుమా. 102

క. తమతల్లి పురంధ్రీ జా
త మతల్లి గదా తదీయ తనుజుఁడ నఁట హా
రమణీ యొకతి నై నను
రమణీయే తరగుణంబు రా నేర్చునొకో. 103

గీ. ఈతలఁపు నుజ్జగింపు భూమీశునాన
యింకఁ బదివేలు నేల నా హృదయ శుద్ధి
యొరు లెఱుంగరు మదనారి యొకఁడె గాక
యనుచుఁ దర్జనిఁ జూపి యయ్యనఘుఁ డనిన. 104

శా. ఆనీలాంగక లేఁతన వ్వొలయు నిట్లన్ గ్రమ్మఱన్ నిన్ జగం
బా నా మే లన నీవ తెల్పుకొన నేలా నీగుణంబుల్ సతీ
నూనగ్రామణి వాడు నీహృదయ మిచ్చోఁ గంటి నే దేవతం
గా నే నిపనఁతల్లిఁ గాను విభుభోగస్త్రీని భావింపఁగన్. 105

క. భావజునిబారిఁ బడుచో
వావిఁ దలఁప నేల ధర్మవర్తన మేలా
నీ వింత యేల పెనఁగెదు
నే విడ నాకన్ను లాన నినుఁ గూడ కిఁకన్. 106

గీ. తక్కునుడువులు నుడువుము పెక్కు లేల
యొకగడియమాత్ర మిటు గూడి యున్నఁ జాలు

ననుచుఁ గదియంగఁ దలుపు మూయంగఁ దివురు
నాకలికితోడ ధీరత నాతఁ డనియె. 107

చ. వడి నరపాలుభోగసతి వావులు నాకుఁ బ నేమి యంటివం
గడమున కెల్ల సా డ్డనిసఁ గా దటు నే వలచిన్న నాఁడ వే
ర్వడితి న టన్నఁ బోవునె స్వభావము తల్లివి నాకు నేక్రియం
బడఁతుక నీవు వావి చెడ నుందు మహిం గల దమ్మ
యెందులన్. 108

క. వల దిటువలెఁ గక్కూటితి
వలుకులు వలుకంగ నింత వదరం దగునే
తలపోసి చూడు లెస్సఁగ
నెలఁతా రత్నాంగి యొకటి నీ వొక్కటియే. 109

క. కాయములుఁ గొమిరె తిమిరపుఁ
బ్రాయములుఁ దలంవ నస్థిరంబులు వీనిన్
స్థాయిగ నమ్మి యకృత్యము
నేయఁగఁ బూనెదవు మీఁది సిలుఁ గెఱుఁగవుగా. 110

ఆ. ఇవుడు ధైర్య మూని యినుమంత వువ్వకో
దండధరునిబాధ తాళ లేవు
పావ మెంచి మీఁదఁ బటుగార్లఁ బట్టించు
దండధరునిబాధ తాళఁ గలవె. 111

మ. ఖరభానుప్రియసూనుఁ డిప్పుడు నినుం గారించునే కా విభుం
డఱచేలోపలినిమ్మపంటివలె నత్యాసక్తి మన్నింప సౌ
ఖ్యరసైకస్థితి నుండి కావరమునన్ గన్గాన కాపత్పరం
పర రాఁ దుల్లెద వేలయో విధిఁ దరింపన్ నీతరంబే మహిన్.

చ. అనవుడు నవ్వి శాలతరళాక్షి కటాక్షములందు నంకురిం
చినకినుకన్ బటాంబఝులు సేయక నవ్వుముసుంగు వైచి యి
ట్లను నళినింగనుంగొని యనంగునిమామ వెలుంగుసానఁ దీ
రినకలువాఁడితూపుఁగిఱరించిన ఘోర మిటారి చూపునన్.

ఉ. ఎన్నఁడు నేర్చినాఁడవుర యీ మటుమాయపుమాట లీవు నా
కిన్ని దలంప నేమిటికి నిప్పుడు దోసము పెద్ద చేసి యా
దున్నవయాళికానిఁ గడు దొడ్డఁగఁ జెప్పి భయంబు నూపి చ
క్క న్నను ముద్దు వెట్టి యిటుకంగఁ దలంచెదు మాను
మీవగల్. 114

గీ. నినుఁ గలయుభర్త కోపగాఁ డనఁగ నేల
కోల బుజమున నిడి దున్నఁ దోలువాఁడు
అవ్వ యన నేల గా నౌనౌ రద్ది యౌనౌ
నాఁటి కిపు డేమి రారాదె నేఁటి కలఁప. 115

క. ఇక్కల్ల దెలిసి విభుఁ డిం
కొక్కవ్వడు సేయుచేఁత కోప్పితిఁ బని లే
దెక్కడితగ వెక్కడికోల
మెక్కడిదా వేల కొమ్మ లెవ్వరి సొమ్ముల్. 116

గీ. వలచి పట్టినఁ దాలిమి వదల కిప్పు
డెన్ని చెప్పెదు తగవు లీ వేకతమున
మొనసి యూరకె రతిరంగమునకు రాని
ముద్దు లివి యేల చాలింపు సుగుణి వౌదు. 117

క. వలవదుగా రతి మరునకు
వలవదు గా రంభ యక్షవరసూనునకున్

వలవ దురాశలఁ బెట్టఁగ
వలవదు రా వట్టిజోలి వార్తలు విడుమీ. 118

సీ. దారువనస్త్రీలఁ దగిలెఁ గాని యదేమొ
నీవలె ముక్కంటి నేరఁ డయ్యె
గారాబుఁగూఁతునే గవిసెఁ గాని యదేమొ
నీవలెఁ బరమేష్ఠి నేరఁ డయ్యె
నలయహల్యాకాంత నంటెఁ గాని యదేమొ
నీవలె జంభారి నేరఁ డయ్యె
గురునిల్లాలితోఁ గూడెఁ గాని యదేమొ
నీవలె నుడురాజు నేరఁ డయ్యె

గీ. వారికంటెను హెచ్చైనవాఁడ వౌర
నీకుఁ గలబుద్ధి వారికి లేకపోయె
నీవు నాఁటికి లేక పోయితివి గాక
చేరి వారల యోజలు చెఱుప లేవె. 119

ఉ. నావుడు నిట్లనుం సుజననాయకుఁ డీ వెడమాట లేల త
ల్లీ వినవమ్మ యోజకము లెల్ల సృజింప భరింప నోంపఁ జా
ల్దేవత లెట్లు వర్తిలిన తె న్నవుఁ గాకివి చెల్ల వేరికిం
నీ విధ మెన్న రంభ రతి నీవలెఁ బుత్త్రులఁ బల్కఁ బట్టరే.

క. మన నేరవు పతిమతి రాఁ
గన నేరవు సుదతి తగవు గా దన్న నహా
యన నేర వెంత సెప్పిన
విన నేరవు చాలుఁ జాలు విడు పోవలయుం. 121

క. అని పల్కునతనితాల్మికి
మనమున నెఱి విఱిగి చాల మఱియును గలిఁ బో

సినవెనుక నుట్లకడఁ జూ
చినగతి నను నతివ యూన చెడ్డది గాదే. 122

క. ఆూ మైనఁ గరఁగు నే నివు
డీ యాడినమూటలకు నొకింతఁ గరఁగ వే
మోయి యిది నీకు మంచిదొ
కో యూఁడుది యునురు మన్నఁ గొఱ గాఁకు సుమీ. 123

చ. కలికి పిసాళి వాలుఁ దెలిగన్నులపై నిడనేల కెంపు నా
పలుచని మోవి కెంజివురుపై నిడరా నెఱజాణ నాయెదన్
నిలువఁగ నేల గోళ్లు బలునిబ్బర వబ్బుర వుబ్బు గబ్బి గు
బ్బలవయి నిల్పరా సుగుణ పైవయి రేఁపకు కోపతాపముల్.

ఉ. వే దన మించునీవిరహవేదన తాళఁగఁ జాలఁ గంతునిన్
సా దన రాదుగా తనదుసాదన చూపఁ దొడంగె గాడ్పుదా
నీఁ దన వచ్చునే మొదల నీ దనలాకృతి వేఁడి నూపుచున్
జో దనఁజెల్లునా కడకుఁ జో దనయుంబు శుకంబుప్రేలుచున్.

సీ. లతకూన యని తగు ల్మతిఁ దలంపఁడు గదా
వేఁడితావులఁ జల్లి వేఁచుఁ గాని
జలజగంధి యటంచు సంభ్రమింపఁడు గదా
చుఱుకుసోఁకుల మీఁద నుడియుఁ గాని
చిలుకలకొలికి యుం చలమి పైకొనఁడు గా
చిగురుటాకుఁగటారిఁ జిమ్ముఁ గాని
కలువకంటి యటంచు నలరఁ జేయఁడు గదా
యుడుకువెన్నెల గాయఁ దొడఁగుఁ గాని

గీ. మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు
వసులపాతర లై పేరు నుసుల నీయ

రెటుల నిటు దాళఁ గల దని యెఱుఁగ వైతి
కట్టకటా నీకు దయ లేదు గా యొకింత. 126

గీ. దిమ్మరి గదా సదాగతి తెలిసి చూడ
మెఱియుఁడు గదా యనంగుఁ డేతఱి మఱి మడి
యుఁడు గదా యల్లజైవాతృకుఁడు దలంప
నిట్టిచెడుగులచే బాధ కెట్టు లోర్తు. 127

క. రారావు లేల నేనెదు
రారా ననుఁ జలువ కలువరారా మేడన్
రా రా యని తలిరాకుజి
రా రాయని కేళి నేలరా రాకొమరా. 128

మ. పరిరంభం బొనరింపరా కరుణ నాపై నింపరా యాలకిం
పర యేరా యధరామృతం బొనఁగి నన్ మన్నింపరాయంచు
దై, న్యరనం బుప్పతిల న్నెలంత వలవంతం గుల్కులం
జిల్కుపాం, డర గండ చ్యుత బాష్పధార గొనగోటన్
మీటుచున్ బల్కఁగన్. 129

చ. విని విన నొల్ల కావలికి వేఱె పరాకుగఁ జూచి జూడఁ డే
మన నెటు వచ్చునో యని భయంబున నోరు మెదల్పఁ డ
వ్విధం, బున నది యూడ వేసికొని పోదు నటంచు నుపా
య మెంచు న, మ్మనుజవరాగ్రగణ్య సుకుమారుఁడు లోభి
యుఁ బోలె నయ్యెడన్. 130

క. ఇట్టట్టు చూచి యాచెలిఁ
బట్టిన వలరాచ గబ్బి బలుబూతంబున్
నెట్టుకొని వీడఁ జేయఁగ
గట్టిగ మాటలవశంబు గా దని వేగన్. 131

గీ. అప్పుడు గురుభామ చిత్తాంగి యలమి బలిమి
నొడిసి పట్టిన పైకోక విడిచి చనియెఁ
దా నవీనకళానిధి యై నెగడిన
యట్టి సారంగధరుఁ డయ్యె నబ్బురంబు. 132

గీ. సాము సేసినగతి దట్టిచల్లడముల
తో వెడలె స్త్రీకి లోఁగాక దేవుఁ డనఁగ
నీరు పైకొని వచ్చిన నేరికైన
కోక యనుబుద్ధి గల్గునే లోకమునను. 133

క. వేగ పులిచేతఁ దడఁబడి
యేఁగెడుగతి పట్టు లేఁగ నెంతయు మఱి యా
లోఁ గామిని తన కాతఁడు
లోఁగామిని వంత జింతిలుచు ని ట్టనియెన్. 134

క. ఎటువంటి సుగుణి వయ్యో
యిటువంటిది రసికముద్ర యేఁగెదు పైదు
ప్పటి విడిచి నేర్పు చెలి నేఁ
చుటు మఱి నీయంగ మెల్లఁ జూపితివి గదా. 135

క. ఆరోపింతును నాపై
నేరము విపరీతముగను నీపై రారా
యూరకె యిఁకైన రాజకు
మారక నామాట వినుట మంచిది సుమ్మా. 136

శా. ఔనా పోయెదవా ననుం గలఁచి యేలా యింక నీతోడ
నెం, తే నేమింపఁగ నాడఁ జిక్కె నిదిగో నీయంగమచ్చం
బు నా, చే నీలోనన గాజు రావలెఁ గదా చెక్కింతు నీ

కీలుకీల్, గానీ యిందుల కేమి తాళు మని కేలఁ జో
మ్ము తాటించుచున్. 137

క. సారెఁ బగ చాటి పలుకం
గా రిచ్చలు విఱిగి పోవఁ గా శ్లాఘక యా
భూరమణసుతుఁడు సద్గుణ
హారుం డటు నిలిచి యిట్టు లనుఁ బటుబుద్ధిన్. 138

క. తల్లీ నాపై నీకుం
జెల్లునె కోపంబు మదన శిత శర పాళీ
హల్లీసక నిహతి వ్యథఁ
దల్లడపడి పట్టిదూఱు తగవా పూనన్. 139

మ. ఇవు డీ వాడుభయంకరోక్తులకుఁ గానే లోఁగి దుర్వృత్తిన
ల్పపుసౌఖ్యం బగునీమనోరథము దేర్పం బూనినఁ లోకమం
దపకీర్తిం బడి మీఁదఁ ద్రెళ్లి యమబాధఁ నిక్కముం జెంది
హీ, నవయోనిం దుదిఁ బుట్టఁగా వలయుఁ గాంతా పెక్కువే
లేం డ్లిలఁ. 140

గీ. అట్లగుటకంటె నీఁక వినవమ్మ యొకటి
జగతిలోఁ గీర్తి వెలయఁగాఁ దెగువ మీఱి
నీకు రాజన కింపు నంధిల్లుచేఁత
కియ్యకొని యుండ నటుమీఁద నీశ్వరాజ్ఞ. 141

ఉ. కావక రాజు చిత్తము వకావక లై తెగఁ జూచునట్టు లా
హా విపరీత మైనపలు కాడెద నంటివి ముఁ 'వినాశకా
లే విపరీతబుద్ధి' యని లెస్స బయల్పడఁ జెప్పినారె కా
నీవిధి యాడుమీ యనఁగ నీవిధి నాడదు సుమ్ము భామినీ.

క. నీ కపటోక్తులె పట్టి మ
హీకాంతుం డలిగెనేని యీధారుణి య
య్యాకాశవాణి యెఱుఁగ రె
నీ కాళ్లోల తోడుతోడనే సిద్ధించున్. 143

గీ. అని పలికి పోయి వచ్చెద ననుచుఁ జక్కఁ
దననగరి కేఁగి యువరాజు తగినరీతి
దొరల భృత్యుల సఖుల నందఱను బనిచి
తుందుడుకు డెందమునఁ జాల నందడింప. 144

సీ. పట్టు పాఱు మటంచుఁ బారావతంబును
వెకలినై నే నేల విడువఁ బోతి
విడువమా యిన్నాళ్లు విడిచిన నది పోయి
యేటికిఁ జిత్రాంగియింట వ్రాలె
వ్రాలిన నది యట్లె పఱదఁ బోనిమ్మని
యూరక యేమిటి కుండ నైతిఁ
జనవుమై నుండక పినతల్లి యని పోవఁ
జెడుగుణం బామెకుఁ బొడమ నేల

గీ. పొడమెఁ బో యిది బుద్ధిగా దుడుగు మనిన
మాన కిటువలెఁ జెల్లునే మచ్చరింపఁ
గారణం బన్నిటికి నల్లపారువము క
దా యదెక్కడఁ దాఁపుర మాయెఁ దనకు. 145

క. మాయ నెటులైన మీఁదట
నాయనుబాధలను బడుట యది నిశ్చయ మే
మాయ నెటులైన మీఁదట
నాయమబాధలను బడుట యది తప్పెఁ గదా. 146

గీ. అని ప్రమోదించు నను రను నలతఁ గుందుఁ
గుడిచి కూర్చుండి తన చేసికొనిన నేర
మికి వగచుఁ బాన్పుపై వ్రాలు మిన్ను విఱిగి
పైఁ బడినరీతి నివ్వెరపాటు నొందు. 147

క. మదవతికిఁ గోక చేవడి
నది మొదలుగఁ గుట్టు పాఱె యడలుఁ గుమారుం
డెదలోనఁ జీర చిక్కిన
యది మొదలుగ బిడ్డకుట్టు లను కేర్పడఁగన్. 148

గీ. అంతఁ జిత్రాంగి మదనబాణాగ్ని వేఁగి
హ స్తగత మైనసొమ్ము పో నాడుకొన్న
కరణిఁ బరితాప మంది యేనరణి నైనఁ
జెఱుతు సారంగధరు నింక సిద్ధ మనుచు. 149

సీ. పాయని యపకీర్తి ప్రాపించుఁ దన కన్న
పోలిక నల్లనిమ్మైల గట్టి
తల చూపఁ బాసె నందఱిలోనఁ దన కన్న
కైనడి వానెనకట్టు కట్టి
తనుఁ దోఁ్రియుదురు గదా ఘనకూపమున నిట్టు
లనుభాతి మూలయింటను వసించి
తనదేహ మిటులఁ జిందఱ లౌ ననెడురీతిఁ
గులుకుగుబ్బలు వాఁడిగోళ్ల వ్రచ్చి

గీ. యెంతపాపాత్మురా లని యింక మీఁద
బ్రహ్మ నిజఫాలఫలకాంకురములు గట్టి
పెట్టునట్టులఁ గస్తూరిపట్టు వెట్టి
సొటసొటలు వోవు విన్న నై సొంపు దఱిఁగి. 150

క. రక్తి గల చెలుఁ యెడ నా
సక్తియు నూరక్తియును లేక జాలి విరాళిన్
ముక్తాహార మనోహర
ముక్తాహారయయి క్రోధమున సౌధమునన్. 151

గీ. జంట యిటు లల్గి యుండ నా జంత నచట
సరసిచెంత బిసాగ్రంబు సరసి కొంత
మగని కందిచ్చు కోకిపెట్టియ గని తనదు
దుండియెడఁ దగు లెంచి యం దుండి యపుడు. 152

ఉ. కేలుఁ జోకాటపుం దలిరు కేశమదాళులు కానుదీఁగ లే
నూలును జన్నుమొగ్గలు గనుందెలిదమ్ములు మోవి తేనియుం
జా లగునవ్వుఁ జేటయు భుజాబిసము ల్గని యవ్విలాసపాం
చాలుఁడు ప్రేమఁ బద్మిని నిజప్రియఁ గా మదిలోఁ దలం
చుచున్. 153

చ. దళ మగుతమ్మిపూఁగొలని తావి నెకల్ గదియంగ ముంగలన్
జిలుకలు గోయిలల్ చెవులు చిందఱవందఱ సేయ నూరెలన్
మలయసమీరముల్ వెనుకమర్లున నుల్కి పడం బయింబడన్
గళవళ మంది చుట్టుకొనెఁ గంతునిమందియటంచు నాత్మలో

ఉ. అక్కట యేమి సేయుదు రయంబున నిప్పుడె పోదు నంటి
నా, మిక్కిలి దూరదేశము సమీపమె మాళవభూమిమం
డలం, బెక్కడ దండకావన మి దెక్కడఁ జిక్కనిముద్దు
గుమ్మ నా, చక్కెరబొమ్మఁ జూడ కిట సైఁపఁగఁ జాల
వియోగవేదనన్. 155

వ. అని యత్యంతసంతాపంబున నాందోళించుచు. 156

క. రాజిత విభ్రమ లవ కల
నా జిత సుర మానవాంగనల్ జిత్రాంగిన్
లేజవ్వని మదిలో నిడి
రా జవ్వనిలోపలన్ విరాళిం గ్రాఁగెన్. 157

గీ. అట పరావనిభృ న్మౌళిఘటితపాదుఁ
డైన చక్రేశ్వరుండు సహస్రకరుఁడు
రామవిశిఖాగ్ని తేజఃస్ఫురణ హరింప
వ్రాలె నన వ్రాలెఁ జరమాంబురాశిలోన. 158

మ. తమి మందేహులతోడఁ బోరి యినుఁ డంతన్ వీఁగి తన్
జేర న, స్తమహీభృన్మణి వెన్క వేసికొని మిత్రిప్రేమ
రక్తప్రవాహముగాఁ బోరె ననంగఁజిక్కె యులదైత్యశ్రేణి
కాస్పింపకుం, డ మొగు ల్గాయలు పన్నినాఁ దనరెఁ బా
డన్ సంజకెంజీఁకటుల్. 159

ఉ. ద్రోహమె నీతిగాఁ దలఁచి దుర్మదుఁడై కనుఁ గాన కా
త్మ్మప, త్నిహరణం బొనర్చె నని దేవగురుండు శపింపఁగాఁ
జమీ, యూహారిణాంకుఁ డిట్లు తుము రామె నటంచును
జారచోరులు, త్సాహము మీఱఁగా నపుడు తారకముల్
నెరసెన్ నభంబునన్. 160

గీ. నల్ల ప్రజపై నరగ దండు వెల్లఁ దలఁచి
రాజు వేయించువెలిగుడారం బనంగఁ
దోఁచెఁ బాండిమ ప్రాచిఁ దోఁడ్తోన యందుఁ
గువలయదళమ్ము లప్పుడు గూచి యమ్యె. 161

క. కలువలు కిలకిల నవ్వెన్
దొలిమల నెలహోటి యవలి తుహినాంశుకరం

బులు గని యువు జేటావలి
గిలిగింత లటంట వానికిఁ సరి దాఁకెన్. 162

సీ. కరము లొయ్యనఁ జాఁచి యిరులనెఱుల్ చక్కఁ
గాఁ దీర్చి తెల్వి సంఘటిలఁ గూర్చి
కడు నయనచకోరికల ముద్దు గావించి
చనుజక్కవల గోళ్ల నెనయ నాని
కళలు రంజిల్లంగఁ దోలునాఁడు తనుఁగూడి
యిటఁ బొరిద్దు గ్రుంకునప్పటికి రేపు
వడి వచ్చి విలుతు నీ కడల నేఁటికిఁ జాలు
నని యేఁగుటను జేసి యవ్విధమునఁ

గీ. దామరల నిక్కువమ్ముగఁ దనకు ముదము
లతిశయిల్లంగ వే వచ్చి యవుడె నిల్చె
దమివిటుఁడు తూర్పుదిక్కు లేఁ గొమిరెవయసు
బిత్తరిముఖంబునను బొట్లు వెట్టినట్లు. 163

గీ. రిక్క లెనయంగ నుదయభూభృత్తటమున
వెలివిఁ బొదల మృగాంకమండలముఁ జూచి
వేగ విల్లెత్తి వచ్చునివింటిబోయ
యట విరహిజాలములను వేఁటాడఁ దలఁచె. 164

వ. అప్పు డల్ల హల్లకహి తాభిజన జనవల్లభ శల్లజం డా
యల్ల కొనల దండహ్యమాన మానసుం డగుచు నిబిడ
రస కుసుమ కిసలయ విసర వీతల చూతలతికా నికాయ
నికాయ్యంబున నిశాకాంత కాంతమణి వేదికా నితాంత
కాంతి లతాంత శయ్యాంతరంబున మేను నేర్చి పరిచార
కుల నందఱం బనిచి యేకాంతంబున నొక్కరుండ

చిత్రాంగీ లతాంగీ దిదృక్షానదృక్షాతిజాగరూకరూకాక్షుం డై యుపరిప్రదేశ ప్రసూన వితాన నిర్గళ దనర్గళ మరందోదకబిందు ధూళి పాళికలు చందన చర్చలుగా మరుద్ధోధూయమాన ప్రాంత శారద భూరుహ దళవ్రజం బులు వ్యజనంబులుగాఁ దన్నిపానం బయ్యున్న శిశిరకృత్యం బులు ఘటియించుచుండ నిమ్మ కెరువు వేసినచందంబున నందు నంతకంతకుఁ బరితాపం బగ్గలం బై యూవల నీ వలం బొరలం దొడంగె. 165

క. మధుమాసం బఁట శుకపిక
మధుపాది మనోజబల సమన్విత వన మీ
యధివాసం బఁట యాపై
విధుఁ డుదయించె నఁట విరహి వేఁగుట యరుదే. 166

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ దోడన వ్రాలెఁ బై విరుల్
మిట్టిపడంగ వీఁడె దవిలెం బథికుం డడకొత్తులోనిపోఁ
కట్టుల నంచు గాలి గలయువ్వాడె తూరుపుపాఱఁ బట్టుకొ
న్నట్టిప్రకార మేర్పడ ననంగుఁడు నించినతూపులోయనన్. 167

చ. వెనుకొని యంతలో మరుఁడు వెంద్రుకపట్టిడుతూపులేర్చి బో
రుననలయించువిల్లుగొని త్రొక్కనిచోటులు ద్రొక్కు వాజిపైఁ
బనుపడ నెక్కి నీళ్లపయిఁ బాతెడులీలఁ జెలంగు మంచి తి
య్యనిపద నైనవాల్నిలిపి యట్టిటుచేసె నృపాలుడొందమున్.

వ. అత్తఱిఁ దత్తరిల్లి చిట్టాడిన గుట్టున నిట్టసం దెట్టిగిలంబడి మట్టు మాటినట్టిమరు కరాళి తేజీల శిశిరకరాళి చకోర కానిల రమానూనుల నుద్దేశించి వసుధేశుండు సుప్రలాప విప్రలాపంబుల నిట్లనియె. 169

సీ. ఓచందమామ నిన్ జూచినయపుడె మా
చిత్రాంగి మొక మింత చేసికొనును
రాచిల్కలార మీరాక గన్నపుడె మా
మదిరాక్షి నోరార మాటలాడు
నెలదేటులార మి మ్మీక్షించినపుడె మా
గజయాన తల గ్రుచ్చి కౌఁగిలించుఁ
దమిఁ జకోరములార మిముఁ గాంచినపుడె మా
కలకంఠి కన్నులఁ గప్పుకొనును

గీ. దయ గలిగి కూర్పుచుట్టంబు లయితిరేని
యటకు మీ రేఁగి తా విరహార్తి వేఁగఁ
దెలిపి మావద్దకంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ
గూర్పఁగదరయ్య మిము వేడుకొనెదఁగాక. 170

గీ. తనదుపై రైనయిరులు చిందఱలు సేయు
దనుచు నినుఁ బట్టఁ జూచుఁగా యౌతమంబు
రాజ నీపేరివాఁడ గోత్రపతి వీవు
వల దనక మారుతోఁ గూడి కలఁప నేల. 171

మ. నను నీగోత్రజా నింత యేఁచుటకుఁ గా న్యాయంబె నీ కబ్జ చ
య్యనఁ దోఁబుట్టువు లైనయబ్జముల నీ వయ్యో పగల్
మీఱఁగా, ననయంబుఁ గటిగందఁ జేయుదువు నీ కట్లాగ
మె ల్లేని రాజునకుం దమ్ములమీఁదఁ బ్రేమ గలదా సొం
పారఁగా నెందులఁ. 172

గీ. పాము తనరఁ గా మునియెడు పలుకు నిజము
గా మెలంగినరాహువు గఱచి నిన్ను

నేమి సేయక పోయె న దేమి యకట
యోషధీశుండ వీ వౌటనో మృగాంక. 173

చ. సకలుఁడు కాలకూటసహజన్ముఁ సుధాకరుఁ డండ్రు నిక్క మా
నౌకొ యిది యంచు నోసితమయూఖ నినుం దెలియంగఁ
గోరి యూ, రక యటు చేరినంతఁ దలప్రాణము దోఁకకు
వచ్చె లెక్క నే, యక దిగ మ్రింగె నేని యకటా యులరా
వాలువు మన్కి గాంచునే. 174

ఉ. ఆవిమలాత్ముఁ డౌమధునికాటమహాబలభేది యైనలో
కావనుపట్టి వై మధునికాట మహాబలులందుఁ గూడి లో
కావళి నేఁచ నీవు విరహార్తులమీఁద నె చూపుశౌర్యముం
భావజ యీహాళాహళియు భర్గునిముందఱఁ జూప వైతిగా.

సీ. కరమండలాగ్రైకకలన భాస్వద్ద్విజా
వలిఁ బొఱఁ దోలినతులువ వీవు
నమ్మి నెక్కుడు గాఁగ నమ్మి యుండెడు మేటి
గురుని కె గ్గొనరించుకుమతి వీవు
మిత్త్రుండు పడినంత మెఱసి ధామంబు ముం
దుగ నాక్రమించిన ద్రోహి వీవు
తమ్ముల మిగులఁ బాదమ్ములఁ గారించి
యుల వింటఁ గనిపించుఖలుఁడ వీవు
గీ. కటకట వియోగలోకంబు కటకటపడ
ననలశరముల నేఁచకు మనిన నీవు
మానుదువె నీగుణంబు లౌ నౌను మేన
మామపోలిక యిది గద మాకుమార. 176

ఉ. ఏం ఖరవృత్తిఁ జూపఁ దగవే విరహార్తులపై ధురంధర
త్వ్యంఖళ రేక్షుచాపములు వూ నిటు లేటికి సాము సేసెద
ల్యుం ఖల మా శరీర మని కాన కనంగ యదెూ 'శరీర
మాద్యం ఖలు ధర్మసాధన' మ టన్నది విన్నది లేదొ
యెన్నఁడుఁ. 177

గీ. మలయపవమానబాలకుల్ మందులు గద
యమృతకరుఁడవు గద నీవు కమలవైరి
యకట యిటు లయ్యుఁ బెంపు సేయంగఁ దగునె
యంగజవ్యాధులను మాన్పకం గరంబు. 178

క. వ్రతమా యిటు లేఁచ మధు
వ్రతమా నీ కుచితమా విరాళిం బడునా
రుత మాలింప వదెూ చా
రుతమామోదయుతమా చిఱుతమారుతమా. 179

పంచచామరము.

జొహారు మీకుఁ జల్లగాఁగఁ జూడుఁ డోసమీరకం
జహారులాల మంటమారి శంబరారిఁ గూడి నఁ
న్నొహారు సేఁతు నేల సారెకుఁ జలంబునం భుజం
గహారుపాద మాన మీరు కాఁక లింకఁ జేసినఁ. 180

చ. పలుమఱు పచ్చరాచలువబండల వ్రాలుచుఁ బారిజాతమం
జులలవలీనికుంజముల సోలుచు విన్నదిఁ దేలుచుఁ సురల్
నెలకొని కంటికిన్ నిదుర లేక చరించుచు నుండు బిల్ల నీ
కళలు భుజింపఁగా నయినకాఁకకుఁ గాక సుమీ సుధాకరా.

చ. గరళపుముద్ద దిన్న కటికంఠుఁడు నీకళ దాల్పఁగా నిశా
కర జడగట్టి మీఁద హిమగాంగజలంబుల నందు నించి మే

నౌరయుఁగ నుండఁ జేసె నటు లుండియుఁ దా నగ మయ్యె
హాసుధా, కరుఁడవె యైన నిఁక వెడలఁ గ్రాయుఁగ నేమిటి
కల్ల రాహువున్. 182

చ. చిడిముడిపాటునన్ జెఱకుసింగిణిఁ బూని మధుప్రియత్వ
మే, ర్పడ వడిలావు లున్నవారిపై ని జివురుకున్న నెక్కి యు
క్కునన్, వెడలెడు చంద్రుఁ జూచి తమి నేఁ డిదె గోవధ
మాచరింము పూఁ, పదరఁగ నీవు వచ్చితుర కౌదువు పాం
థులకున్ మనోభవా. 183

వ. అని యానేకప్రకారంబుల నవ్విశ్వంభరాజంభారి యుపాలం
భం బొనరించి మందరగిరియునుం బోలె వనరాశిమధ్యం
బున మరు న్నిశాచర కర భ్రమితుం డై లోభియునుం
బోలె నతనుదుష్టమార్గణగణక్షుభితుం డై పద్మాకరంబు
నుంబోలె మధుపరాజిరసుమనఃపాళి యై విరాళిం దూలి
యున్న సమయంబున. 184

చ. ఇనుఁ డుదయాద్రి నండగొని యిప్పుడె సంజను మ్రుచ్చి
లంబడన్, బనిచి రయంబ తా వెనుకఁ బ్రాఙ్ముఖపార్శ్వము
లేర్చి దాడి దా, నొనరిచె నోటమిం బయట నుండక పొ
మ్మని వేగుఁ దెల్ప వ, చ్చినగతి వేగుచుక్క పొడిచెన్ జన
రాజును బశ్చిమాద్రికిన్. 185

మ. ఇనుఁ దన్రాముఁడు ప్రేమ సారసవనం బీడేర్పఁగాఁ జొచ్చి
మిం, చినసంధ్యారుచి రక్తధారలు ప్రవర్షింపంగ వింటం
గరం, బను వంక న్నిగిడించుచో సమయవాయవ్యాస్త్ర
ముద్వృత్తి న, క్కాన మారీచనిశాచరుం డన మృగాం
కుం డంబురాశిం బడెన్. 186

గీ. ద్విజకులమ్ములకూఁతలు దెసల నెగసె
నింకె సద్గుణ తేజముల్ పంకజాతి
మటు విజృంభించెఁ గువలయం బట్టిటు వడ
నట్టు లగుఁ గా యరాజకం బైనయెడల. 187

చ. కొలఁదిగఁ జక్రకైరవ చకోర సరోజదళంబులన్ జలం
బలవడఁ గూర్పఁ బిప్పఁ గలయట్టియినుం డలచందమామ క
ర్త్మలిఁ గర మిచ్చి పుచ్చుకొనుమిత్తుఁడు చీఁకటు లెల్లనీరుగా
నలఁచువిభావసుండుగననయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్.

వ. అయ్యెడం గాలోచితకృత్యంబుల నిర్వర్తించి సమస్తచమూ
సమూహ సమేతుం డై నరపాలపురుహూతుండు గదలి
నిజరాజధానిఁ జేరం జనుదెంచి నగరు ప్రవేశించుసమ
యంబున. 189

సీ. శృంగారము లెసంగ బంగారుపుమెఱుంగుఁ
బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుపఁ
బుణ్యాంగణములందుఁ బుణ్యాంగనల్ గ్రమ
గా సారె ముత్యాలసేసఁ జల్లఁ
జెలరేఁగి మణిసౌధముల మూఁగి యవరోధ
కామినుల్ సోరణగండ్లఁ జూడ
వాద్యఘోషణముల హృద్యభాషణముల
వందిమాగధులు చెల్వొంది పొగడ

గీ. గడలపౌఁజులరొద లిరుగడలఁ జెలఁగ
దొరల నందఱ మన్ననల్ దొరల ననిచి
వడి నిగుడఁ జేజిఁ గొల్వు చావడిని డిగ్గి
యరిగె నత్తఱి మహిభర్త యరిగె లెత్తె. 190

గీ. అటుల నంతఃపురంబున కరిగి విభుఁడు
కొలువుసింగారము సడల్చి కొందఱ నుడి
గంపుఁగుంభ స్తనుల జలకంబుఁ బట్టుఁ
డనుచు నానతి యీ నంత నతిరయమున. 191

సీ. రమణి నిల్పె మనోహరమణిపీఠి యొకర్తు
తల యంటె నీలకుంతల యొకర్తు
అటకలి యిడె లెస్స యట కలికి యొకర్తు
జలజగంధి యొకర్తు జలక మార్చెఁ
దడి యొత్తె నొక్కపు త్తడిబొమ్మ నృపతికిఁ
జెలు వొచలువ లిచ్చెఁ జెలువ యొకతె
సికఁ జుట్టె విరు లొక్కసికతామయనితంబ
వెలఁదికస్తూరి నొక్క వెలఁది యుఁడె
గీ. ధూప మొనరించె నొక్కవిధూప మాన్య
తిలక మొనఁగూర్చె భామినీతిలక మొకతె
మించుఁదొడవులు దొడిగెను మించుఁబోణి
భోజనము పెట్టె నొక్కయంభోజనయన. 192

క. ఈరీతి శిరము మజ్జన
మారోగణ మయి మణీమయపుఁబాదుక లా
యూర్యరముగ మెట్టి యుడిగపు
నీరజముఖ కేలు పట్టి నృపుఁ డిం పెనఁగన్. 193

క. సొగలగు వెండితేరుల
లాగునఁ దెలనాకు మడిచి లలన యొసంగన్
బాగాలు వేసికొని తన
బాగా లున్నట్టిమేడపజ్జకు నేఁగెన్. 194

గీ. వేఁగుచోఁ దొంటిచందాన నించు కైన
మెలఁగుచెలిక త్తియలయులబలము లేక
ప్రాణవల్లభపాలకువ గాన రాక
విన్ననై యున్న యాసౌధవీథిఁ జూచి. 195

క. వాలిక మెఱుంగుఁజూపు ని
వాళిగ నొసరించి యెపుడు వడిఁ జేయును దా
నాలింగన మేమో యిపు
డాలిం గన మనుచు నృపతి వ్యాకులమతి యై. 196

క. అరుదెంచి యలిగి యుండెడి
యరు దెంచి మదిన్ విరాకుఁ డై తపాతపాతోఁ
దరియంగ నరిగి కాతో
దరియంగం బపుడు గాంచి దయ దయివాఱన్. 197

గీ. హంసతూలికాతల్ప మం తల్పమే ల
తాఁగి కడఁ ద్రోచి నేలఁ బడంగ నేల
వెలగఱవునేయు వెలచేలములు గలుగఁగ
నూన ముగుమైల నెమ్మేన నూన నేల. 198

ఉ. కప్పురపుర్ విడెంబు కుతుకంబునఁ జేయ వ దేల వాసనల్
చిప్పిలుకుంకుమంబు మయి లేవ మెయినర్ప వ దేమి చీఁకటుల్
గప్పెడుకీలుకొప్పుఁజపుగా నవరింవ వ దేటి కిప్పు డో
యొప్పులకుప్ప నీ వలిగియుండెడికారణ మేమి తెల్పవే. 199

సీ. ఇం పైనసీపాట కెన గా దటంచునో
యెలనాగ వీణ వాయింప వేల
నీరీతి మాటలు నేర దటంచునో
కలకంఠి చిలుకతోఁ బలుక వేల

తళుకొత్తు నీదుచెక్కులఁ బోల వంచునో
శుకవాణి యద్దముల్ చూడ వేల
యొరయునీపాలిండ్ల కుద్ది రా వంచునో
యలివేణి పూబంతు లంట వేల

గీ. కడు నొయారంబు లై ననీనడలకరణి
నడువఁగ నెఱుంగ వంచునో నంటుతోడ
నంచబోదల నడపించి పెంచ వేల
మోద ముప్పొంగి చిత్రాంగి మోహనాంగి. 200

ఆ. పోతుటేఁగ కైనఁ బొలయుంగ రాదు నా
యానఁ జేసి సుందయాన నిన్ను
నెవ్వ రెగ్గు సేసి రెఱఁగింపవే మది
నళుక వలదు నీకు నలుక వలదు. 201

సీ. తరుణి మహాప్రసాదం బని నీమాట
మంతురుల్ శిరసా వహింతు రెపుడు
రమణి నాబాంధవరాజహంసాళి నీ
యడుగుల కేవేళ మడుఁగు లొత్తు
నండజవరయాన యువని నీపేరు చె
ప్పినఁ బాఱుపా మైనఁ బెగడి నిలుచుఁ
గమలపాణి యొకింత గదిసి నిన్నొకనాఁడు
వట నిక్క చూడ బ్రహ్మయును వెఱచు

గీ. నింత చన విచ్చి యరమర యింత లేక
నిన్ను నత్యాదరమున మన్నింప లేదె
మగువ నే నన కున్న నీమన సెఱుఁగదె
నీకు నేమిటఁ గొదవ వయ్యె నేఁడు చెపుమ. 202

క. వలపు మదిఁ దెలియ కూరక
యలిగితొ నినుఁ దక్క వేఱె యతివలపొందుల్
కలనైన నెఱుఁగ దీనికి
తలిరుఁవిల్తుండె సాక్షి తామరసాక్షీ. 203

సీ. తరుణి నీనూఁగారుసరి యెందు లేదని
దగ్గఱి పాముఁ బట్టంగవచ్చు
వనిత నీముఖకాంతి కెన యెందు లేదని
గెంటక ద్విజరాజు నంటవచ్చు
నింతి నీకౌనుతో నీ డెందు లేదని
యెదురుగా హరికిఁ జే యెత్తవచ్చు
నువిద నీకనుదోయిసవ తెందు లేదని
ధాత్రిఁ దమ్ముల వైచి దాఁటవచ్చు
గీ. నతివ నీకనుబొమల కప్రతి యటంచు
నెట్టిధర్మంబుపై నాన యిడఁగ వచ్చు
నిచ్చకము గాదు నమ్ము నేఁ డిది నిజమ్ము
భద్రగజయాన వలరాజుపాద మాన. 204

గీ. ఉప్ప నైనట్టిచక్కెరలప్పు లీడ
చేఁదువగ గలయమృతంపుఁజెలమ యెనయె
పుల్ల నుండెడి తేనెకరుళ్లు సరియె
వనిత కడుఁ దియ్య నౌ నీదువాతెఱకును. 205

క. మతినమ్మోహా మొనర్చుట
నతిమధురిమ సారెఁ జిలుక నలరించుటనో
లతకూన నీదుమోవికిఁ
బ్రతి బింబమె కాక లేదు ప్రతిబింబ మిలన్. 206

సీ. అతివ నీమోవి ముద్దాడఁ గల్గినఁ జాలు
దివ్యామృతంబు సిద్ధించినటుల
తొయ్యలి నీపైఁటఁ దియ్యఁ గల్గినఁ జాలు
దుర్గాధిపత్యంబు దొరకినటుల
ముదిత నీమొలనూలు ముట్టఁ గల్గినఁ జాలు
భూలోక మంతయు నేలినటుల
యలివేణి నీనీవి యంటఁ గల్గినఁ జాలు
వలమూలధనము నా కబ్బినటుల
గీ. ఇంతమాత్రము సేయవే యిందువదన
తాళఁ జాల మనోజాగ్నిఁ దలిరుఁబోణి
మనవి చేకొను మిఁక నైన మందయాన
యేల దయఁ జూడవే నన్ను లోలనయన. 207

క. కుటిలాలక నీగుబ్బలు
బటువులయి మొగాని కెగయు బంగరునిగ్గుల్
పొటమరిలుఁ బుట్టచెండ్లా
నటుగా దే నింత పట్టి యాడుదునఁటవే. 208

గీ. మదవతీమణి రాలతో మాట లాడుఁ
గదవె నీవట్రువమెఱుంగు గబ్బి కులుకు
టెఱుకు సిబ్బెపు గుబ్బ పాలిండ్లు దెలియ
నీవు మా టాడ కుండెడి దేమి చెపుమ. 209

శా. ఏమే పల్కవు మోహనాంగి యిటు లేలే యల్క చిత్రాంగి
ని, న్నే మంటిం గలకంఠి నావలనఁ ద ప్పేమే యోయారీ
యయో, నామీఁదం దయ లేదఁటే చెలి నను న్మన్నిం

వనే కోమలీ, నీమాటల్ జవదాఁట కుందుఁ గదవే నీకేఁ
వత్త్రితుణా. 210

క. ఇంతీ మదనునిపట్టపు
దంతీ యౌవనపరి మిటారి తండములో మే
ల్బంతీ యేమే రతిపూ
బంతీ దయఁ జూచి నన్ను బ్రతికింపఁగదే. 211

వ. అని బహుప్రకారంబులఁ బ్రార్థించి. 212

క. ఏ మనిన వినని యగ్గజ
గామినియలు కార్పఁ దరము గామిని నృపతి
గ్రామణి సాఁగిలి మ్రొక్కెను
గాముకులకు నిగ్గు సిగ్గుఁ గలవే యెందుఁ. 213

క. ఆ నతిఁ గైకొని యాతని
యానతి మీఱనిది వోలె నత్తఱిఁ జిత్తం
బూనినకపటము నెఱపం
బూనినదై యాఁగయాళి బూమెలు మెఱయన్. 214

క. ఒడలు పసివాళ్లు వాడఁ
వెడయూర్పు నిగిడ్చి మెల్లని కరాంబుజ ము
య్యెడ నూఁది లేచి బడిబడి
బుడిబుడి యేడుపు లెసంగ భూవరుతోఁ డనె. 215

గీ. నిబ్బరిక మేది విను మేదినీవరేణ్య
నీ వరణ్యమునకు వేఁట పోవఁ బ్రొద్దు
గడప లేకెందుఁ జేతఁ జిల్కఁ గొని దాని
చేత నే నటు లుబుసుగాఁ జెలఁగునంత. 216

క. నూరెల ముదికొమ్ముదిసిం
గారము గార మయి పాముకిన్వలె మెఱుఁగుల్
వాఱు చెలువారు నొకతెలి
పారువ మిట వ్రాలె వెఱఁగువడి పడిఁ జూడన్. 217

ఉ. రింగులవల్లెవాటు నవరించి మెయిన్ మృగనాభి నించి వే
భంగులనీటు వెట్టి యలపార్వముఁ బట్టునెవంబు వెట్టి సా
రంగధరుండు నేమము దొఱంగుమదిం జను దేరఁ గొంకు మీ
ఱం గడ కేఁ దొలంగి వడి రాఁ గని రాగనిమగ్నచిత్తుఁడై.

ఉ. ఎక్కడ నేర్చెనో నలువ యీచెలువన్ సృజియింపఁజూడ మీ
చక్కని మేను నీ మెఱుఁగుఁజన్గవ యీనగుముద్దుమోము నీ
చెక్కులకాంతు లీపిఱుఁదుచెల్వము నీనునుఁగౌనుతీరు నీ
చొక్కపుఁగొప్పు నీతళుకుఁజూపుఁలు నీకలహంసయానముల్.

గీ. అని వయఃస్థయవిస్మయాయత్తుఁ డగుచుఁ
జిత్తజవికార దుర్వారచిత్తుఁ డగుచు
మరులునను జేరి నసుఁ జీరి నుత్తుఁ డగుచు
నిట్లనియె మానవయహీనవృత్తుఁ డగుచు. 220

క. వనిత గజనిమ్మపండ్లను
ఘనముగ నోరూరఁ జెప్పఁగా విందుము నీ
చనుగుబ్బల యొయ్యారము
విని నప్పుడె వానివులుసు విఱుగుం జుమ్మీ. 221

క. తళతళ మనువజ్రంబుల
తలతల మనునీదురదనతతిఁ బోలదె కా
యలచుక్కలనిగనిగ యో
షాలఁతి నీకాలిగోరుఁ బోలదు సుమ్మీ. 222

క. నీ కలికితనమునకు బి
బ్బోక శ్రీకిఁ బయోవిభూతికిఁ దలఁపఁగ
నీకుఁ జేనికిఁ దగునే
నాకు న్నీకు దగుఁ గాక నాళీకముఖీ. 223

క. నెమ్మేను గంధవహము మొ
గమ్ము కళానిధి యనంగకలితము నడు మా
కెమ్మోవి మధువు నాఁ గద
కొమ్మా యెటు లోర్తు నేలుకొమ్మా నన్నున్. 224

సీ. నెఱిగొప్పు కొనగోర నివిరి చూచెద నన్నఁ
జెలి నీ వది ఘనంబు చేసికొనెదు
గట్టిచన్గవ చేత ముట్టి చూచెద నన్నఁ
జెలి యది యొకకొండఁ జేసికొనెదు
పసిగాను పిడికిటఁ బట్టి చూచెద నన్నఁ
జెలి యది గగనంబు చేసికొనెదు
మించుమే నటు కౌఁగిలించి చూచెద నన్నఁ
జెలి యది బంగారు చేసికొనెదు

గీ. తెప్ప లెత్తిటు చూడవే యొప్పులాడి
యెంత దయలేనిదానవే యేణనయన
యానపడువారి నెఱుఁగవే యలరుఁబోఁణి
చాటు కేఁగెద వేటికే జలజగంధి. 225

గీ. అనుచు నాకేలు పట్టినయప్పు డధిప
యేమి చెప్పుదు నానిగు లీశ్వరుండ
యెఱుఁగు నాసిగ్గుఁ గాచువా రెవరు లేక
మిట్టి మీఁ దై పడి చెనంటి నిట్టు లంటి. 226

శా. ఓరీ నాపతి లేనిచో భయము లేకొక్కింత శుద్ధాంత మె
య్యారం జేర్పడఁ జొచ్చి నన్నుఁ గని కామాంధుండ వై
ప్రేలెదీ, వారాజన్యునిసొమ్ము ప్రాయమును నాప్రాణంబుఁ బో
మ్మారకే, యీరీతిఁ బినతల్లిఁ బట్టిన ఖలుం డెచ్చోఁ గలండే
మహిన్. 227

క. అనినం గామవికారము
నను బలిమిం గౌఁగిలించి నఖముల వ్రచ్చెన్
జనుఁగవ 'ముంజేకంకణ
మున కద్దం బేల' చూడుము మహీపాలా. 228

వ. అని రయంబున నాఖండల భుజగ్ర మండలాగ్ర ధారానవ
విదారిత ధరాధరావరణధారాధరంబునుం బోనివయ్యెద
చెఱంగు మఱుంగువాయం దిగిచి యయ్యెడ. 229

క. కుమ్మెలు దాఁకినబంగరు
బొమ్మరములమొమ్మెఁ గడకుఁ బొ మ్మనురేఖా
సమ్మిళిత స్తనకుంభత
టమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తికతోన్. 230

ఉ. ఇం తపకీర్తి గాఁగ ఘటియింతునె ప్రాణము దెంత యీ
విధం, బంతయు నీకుఁ దెల్పుటకు నై యిట నుండితి నీ
మపట్టి న, న్నింతట నుండి బట్టి రమియించిన యప్పుడె
మామ వైతి నీ, కింతటనుండి కోడలఁ జుమీ నను ముట్ట
కు రాజశేఖరా. 231

గీ. కలికి రత్నాంగి నీకులాంగన రమించు
మించుమేడకు నరుగు మమ్మెఱుఁగుఁబోఁడి

పోఁడిమిగ నిన్ను రతిఁ దేల్చి పొందఁ జాలుఁ
జాలు నాతోడి గొడవ నీ కేల యధిప. 232

చ. అని యపు డంతఁ బోక మఱి యాయనృతోదరి రాజు
చేత నుం, డిన బెడిదంపుఁజాయల పిడెం బౌర వెల్ల జరీన
దూసి గొ, బ్బున మెడమీఁదఁ బెట్టుకొనఁ బోవ నహా
యని సంభ్రమించి మిం, చినతమిఁ బట్టి యింతపని
సేయుదువా మదిరాక్షి నీ వనన్. 233

క. ఔఁ దల ధరణీపాలక
కాఁ దలవం పాయె నిప్పు డందఱిలో నె
చ్చోఁ దలపెట్టక నెన రి
చ్చోఁ దలపెట్ట కటు విడువు చూతువు నన్నున్. 234

క. అని మరుబాములఁ బడ లే
నని కైదువు దుస్సి దాఁటునాయితముబలెన్
వెనఁగునలయుఱియచేసురి
యు నులిమి బలిమి విడిపించి యను ననురక్తిన్. 235

క. నిను మానము గొను హీనుని
ననుమానము మాని నూనుఁ దనుమోహముచే
తను మాడక తునుమాడుదు
వినుమా యణుమాత్రమధ్య వెత వీడ్కొనుమా. 236

వ. అని బరవసంబుగాఁ బలికి యక్కలికి నూఱడించి మేర
డించినకోపాటోపంబున నచ్చోటు వాసి మాటవాసి
గలరాజమహేంద్రవాసి యుగ్రాకారుం డై మండుచు సభా
మండపంబున కేతెంచి బ్రద్దలవారి నలుగడలం బంచి
యాప్తామాత్యబంధుజనంబులం దగిన వారల రావించి

యథోచితాసనంబుల నుండ నియమించి కొండొకసేపు చింతించి కొంత సంకోచించి చెప్పక తీర దని నిశ్చయించి చిత్రాంగి తన కెఱింగించిన తెఱంగును జెయ్వులకరణియుం దనకన్నరణియు నామూలాగ్రంబుగాఁ దెల్పి యింక నెయ్యది కర్జం బనిన సభ్యులందఱు డెందంబుల విస్మయంబును సంశయంబును భావభయంబును బెనఁగొన ముందు వెనుక దెలియక బహిర్లిఖిత చిత్రాకారంబుల ప్రకారంబున నిశ్చేష్టితులై హరీ యనక హరా యనక నూరకున్న యెడ నందు నయార్ణవుం డను మంత్రిపుంగవుం డిట్లనియె. 237

గీ. ఘోర మగుపాతకం బిది నోర నుడువ
రాదె కా మదిఁ దలఁపంగ రా దొకరికి
నిట్టి యన్యాయ మేజాతి నెన్నఁ డైనఁ
దొంటికతలందుఁ జెప్పఁగా వింట గలదె! 238

మ. తనసీటు ల్మెఱయన్ రయం బడరఁ దోర్లన్ రాణివాసం
బులోఁ, జనులే నేరమి యాఁ గదా సవతి యీర్ష్యం
బట్టి చంపింప నే, ర్పున నీకై వడి మాయ వన్నినది పోపా
మ్మంటిమా యామె నీ, కనుమానంబు దొలంగఁ దెల్పెఁ
గద యూహాపోహ లిం కేటికిన్. 239

మ. అలఘుప్రాభవ యింక నీకొలము రాజ్యం బేమి గా
నున్నదో, తొలఁగెన్ గీర్తి భవత్ప్రతాపబలముల్ దూరీ
కృతం బయ్యె న, కుటిలకాంతారకుఠారకుం దనయుం
దన్ గూర్మిన్ గృపన్ జూచి భూ, స్థలిలో వెల్వడఁ గొట్ట
నట్టయిన నాజ్ఞల్ జబ్బు దాఁకున్ బయిన్. 240

క. జననిం దోడరినపాపా
త్ముని గొబ్బునఁ బట్టి తెచ్చి తునిమింపఁ దగుఁ
వని లే దిఁక సంకోచము
మనుజాధిప కార్య మనుచు మతిమంతుఁ డనుఁ. 241

గీ. అధిప యిది శాస్త్రమతముగా దరసి చూడ
ధనము వోయిన ఘనమనస్తాప మయిన
నొకటి తనయింట దుశ్శీల మొదవిన నది
బయలు సేయంగఁ దగ దనునయము గలదు. 242

చ. చనవున నొక్క వేళ రభసంబు మెయిఁ బినతల్లులిండ్లకుఁ
దనయులు ప్రేమతోఁ జనుట తప్పగునే తమచేయుతప్పు లె
ల్లను మగవారిపై నిడి చలంబున బొంకొనరింతు రెందు జి
వ్వనులమనోగతుల్ దెలియువా రిల సెంతటివారు గావలెఁ.

క. మనమున నిడు టొక్కటి వెలి
నను టొక్కటి సేయు టొకటి యంతయుఁ గపటం
బె నిజంబు లే దొకింతయు
నన్నులోదరి యనుట సార్థ మతివకుఁ జెల్లుఁ. 244

మ. అనిశక్రౌర్యము కల్కిచూపులనె కా దత్యంతకాఠిన్య మం
గనపాలిండ్లనె కాదు చాపలము స్త్రీకందోయినే గాదు త
గ్గనికౌటిల్యము బోటిముంగురులనే కా దెల్ల నుల్లంబునం
దును వేఁటాడుచు నుండు నిక్క మిది యెందు న్నమ్మరా
దింతులఁ. 245

క. జనకు నయిన సోదరు నై
నను సుతు నైన నొకపరిఁ గనం దరుణులకుఁ

దను పెక్కను లజ్జావద
మని హరితో ద్రుపదపుత్రి యనఁ గద తొలుతన్. 246

ఉ. ఓనృప నాకుఁ జూడ నలయుగ్మలి నీసుతునిన్ మనోహరా
నూనవిలాసుఁ జూచి నిలుపోవకఁ బట్టిన లోను గాదె నెం
తే నగు లూని వానిఁ బొలియింపఁగ మాయలు పన్ని
నిట్లు కోం, దేనకు ధర్మరాజులను నిక్కముగా మిమఁ
జెప్ప నేటికిన్. 247

చ. పొలఁతుక మీకుఁ గానఁబడఁ బొందుగఁ దెల్పినదే నిజం
బుగాఁ, దలఁచెద రీర దెంతయును దబ్బర నూ. 'మగ
వాఁడు బొంకెనా, యుల దడి గట్టినట్టు లగు నాఁడుంది
బొంకిన గోడ వెట్టిన, ట్లలవడు' నన్నమాట వినరా వన
రాశివరీతభూభుజా. 248

గీ. ఇలఁ జెటువు మాయ మూఁకుఁడు గలదు గాక
నోరు మూయంగ మూకుఁ దెందులనుఁ గలదె
రొయిరు లనుట కేమి సారంగధరునిమీఁద
నాకు నంశయ మొదవ దో నరవరేణ్య. 249

క. ఏతన్మాత్రుఁడె చేతో
జాతారిక్రపాకటాత్మజాతుఁడు సుగుణా
న్వితుఁడు తెలియక యాడెద
రాతని కటువంటిగుణములా నరనాథా. 250

క. చెలిమాటలకై తొడిఁబడి
ఖలుఁ డని సుతుఁ దునిమి తేని కైకకొఱకుఁ గా
నలకు రఘురాము ననిచిన
యులదశరథుమాడ్కిఁ బిదవ నడలుదువు సుమీ. 251

వ. అని పలికిన మొగంబులు దెలివొంది కొలువువా రెల్ల
మతిమంతుం గొనియాడిరి నృపాలుం డిట్లు నానాప్రకారం
బుల మంత్రుల నారసి యడుగ వార లాడునుడువులకు
నుబ్బూఁతలూఁగునుల్లంబునఁ గార్యనిశ్చయం బిద్ది యన
నేరక యపారమోహసాగరంబున మునింగి తనలోన. 252

క. ఇటు చూచినఁ జెలిపైఁ ద
ప్పటు చూచిన సుతునినేర మవుఁ గా దనఁగా
నెటువలె వచ్చునొ మీఁదట
నటమటమో లేక నిజమొ యది యెఱుఁగముగా. 253

ఆ. అల్లనీళ్ళలోనిము ల్లయినది యిది
యిట్టు లనుచు నిశ్చయింప రాదు
కప్పి పుచ్చ రాదు ఖండించి యాడరా
దేమి సేయువాఁడ నింక ననుచు. 254

క. వ్రాలినతెప్పలు వెతఁ గై
వ్రాలినహృదయాంబుజంబు వసుమతిమీఁదన్
వ్రాలినచూపులు మొగమున
వ్రేలంగను ముక్కుమీఁదివ్రేలుం దనరన్. 255

క. ఉన్నంత నృపాలున కని
యె న్నీతిజ్ఞుఁ డనుమంత్రి యీ మతిమంతుం
డన్నినప్రకారముననే
యన్నులు చపలాతిచంచలాత్మలు సుమ్మీ. 256

క. తనకల్ల తెలువదే కద
మన కల్లలితాంగి బుద్ధిమంతు నొకని నే

ర్పున మెల్లన రాకొమరుని
మన మెల్లను దెలిసి చూడ మన మంపఁ దగున్. 257

వ. అనిన మతిమంతుం డందుకొని యవ్విభున కిట్లనియె. 258

చ. మిగుల దృఢంబు చేసి కద మీ రడుగం దగ వేడఁ జెల్లు ని
మ్మగువని యందు నిక్క మగుమాటకు నిం దడిగింపుఁ దూర
కే, వెగడుకుమారు నాఁడిని వెట్టఁగఁ జెల్లునె వింట లేదె
'యిం, ట గెలిచి రచ్చ గెల్వ' మనునానుడి నానుడి నానుఁడీ
చెవిన్. 259

క. మదిరాక్షుల నమ్మకు నయ
విదుఁడవు గద వేగిరంబు వెరవరిఁ జేయుచుఁ
బదరకుమీ లెన్న పదిం
బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీ. 260

క. అనవుడు జనపతి యడుగం
బనిపిన నే మాయె దోసమా ని ప్పనినం
తన నోరు పొక్కదు గదా
యనిపి యటుం దెలిసి చూతే మని కడు వేగఁ. 261

క. నడిసన్న పెద్దవారలఁ
గడఁకఁ దగువారిఁ బిలిచి కల్ల గలిగినఁ
నుడువులవలనని కానం
బడుఁ గద తెలియుఁ డని పెట్టి పంపిన వారల్. 262

సీ. కల నైనఁ బరకాంతఁ దలయెత్తి చూడఁడు
పడుచు వారలఁ గూడి నడువఁ బోఁడు
మిగుల నిబ్బితికాఁడు మొగమోట గలవాఁడు
పలికి బొంకఁడు బహుభాషి గాఁడు

నేర్చినవారిని నేరనివారినిఁ
దనవారిఁగాఁ జూచువినయపరుఁడు
కినిసి యెవ్వరిని నొచ్చెదుమాటఁ బలుకఁడు
కపట మెఱుంగఁడు గర్వి గాఁడు
గీ. మేరమానిసి సా దుపకారి గోల
నిర్మలుం డట్టివానికి నింద మోవ
జేసెఁగా విధి కటకటా దోసకారి
దయ్యమున కేడ సత్యంబు దలఁచి చూడ. 263

గీ. అనుచుఁ దమలోనఁ గడు నొచ్చుకొనుచుఁ బనుల
పోగ సొగసును గలనృపసూనునగరి
కేఁగి యువరాజునకుఁ దమ్ము నెఱుక సేయఁ
డనిన నవసరములవారు నపుడె పిలువ. 264

క. చని గని మ్రొక్కిన మితవరి
జనయుతుఁ డగురాజసుతుఁడు సవినయమతి యై
తనకగ్ధేసరస నుచితా
సనయుక్తులఁ జేసి యనుఁ బ్రసన్నాననుఁ డై. 265

ఉ. వచ్చినకార్య మేమి జనవల్లభుఁ డంపఁగ నన్నుఁ బిల్వఁగా
వచ్చితిరో తగు ల్గలుగువారల కై మనవుల్ ఘటింపఁగా
వచ్చితిరో వచింపుఁ డని వారల సారెకు వెల్లదమ్ములన్
మెచ్చనికన్నులన్ బెదరుమేకొనని మ్మొగమూఁచిపల్కినన్. 266

ఉ. భూరమణుండు మీకడకుఁ బొమ్మన వచ్చితిమయ్య యెయ్యెడన్
మీరలు రాజకంటె నినుమిక్కిలి మా కనురక్తి మై మమున్

గౌరవలీలఁ బ్రోతు రటు గావున నొక్కటి విన్నవింతు మో
భూరివివేక వీరి నటు పొ మ్మనుఁడా యని యేకతంబునన్. 267

క. ఒకయించుక మదిఁ గొంకుచు
ముకుళితహ స్తు లయి వినయమున రాజకుమా
రక వెఱచి చెప్పుదుమొ వెఱ
వక చెప్పుదుమో యటంచు వారలు పల్కన్. 268

క. ఇది యేమో యని యెదవడి
యదవద యై గుండె భగ్గు మని తల్లడపా
టొదవఁగఁ బలుకుల దీనత
గదురఁగ నది యేమి దెల్పఁగదరయ్య యనన్. 269

సీ. అవనీతలేశుఁ డల్లవనీతలమునకు
మున్న వేఁటాడంగఁ జన్నపిదప
నంగజాలలు గా దనంగఁ జాలఁ జలమ్ము
మీఱ మొక్కలమున మీర లలుకఁ
బారువమ్మును బట్టఁ బాఱునెపమ్మున
రాణివాసముఁ జొచ్చి క్షోణిపతికిఁ
బ్రాణపదం బై నయేణాక్షిఁ జిత్రాంగిఁ
గనుఁగొని మోహంబు పెనఁగొనంగఁ

గీ. దమకమునఁ బట్టినా రని తమ కడలుచు
నావడంతుక దెల్పినఁ గోపగించి
మమ్ము నిది యంతయును నిక్కువమ్ముగాఁగ
నడిగి రమ్మని నిప్పు డప్పుడమిఱేఁడు. 270

చ. అనిన నమశ్శివాయ యని యక్కట యొక్కఁడనుండి సంభవిం
చెను వినరానిపాప మిది చెల్లరె మాయలు వన్ని యీవిధం

బున నలయింతి నావయిని బూన్చను నేరమి యింతరోఁ
తయుఁ, వినవలసెం గదా యిపుడు పీనుల కే మనువాఁడ
దీనికిఁ. 271

క. ఆయమ్మ యాగ్రహం బెడఁ
బాయక నామీఁద విన్నపముచేసిన భూ
నాయకుఁ డిది యౌఁ గా దన
కీయెడ నామీఁద నాగ్రహింపం దగునే. 272

గీ. తల్లి నామీఁద నట లేనితప్పు మోపె
నఁట యల యనుంగుఁదండ్రి దా నదియె నిశ్చ
యంబు సేసె నఁట యిఁకఁ గా దన్నఁ బోన
యేరి నన నేల కల్లరి నేన యగుదు. 273

క. నాపాలిటిదైవముగా
భూపాలుఁ దలంతు నేను బొరపొచ్చెము లే
కీవట్లం జిత్తాంగిని
నాపినతల్లిని దలంతు నాతల్లివలెఁ. 274

క. ఇది యిటువలెఁ గా కెన్నఁడు
నెదలోఁ గొండొకవిచార మే నెఱుఁగమి కా
మదనారియె సాక్షి యిఁకం
బదివేలును నేల పనికి మాలినమాటల్. 275

ఉ. ఏ నిఁక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు నెందు 'రా
జానుమతంబు ధర్మ' మని యెంద్రుగదా బుధులైననేమి 'యె
ద్దీని నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు' మటన్నచందమే
కానఁగనయ్యె నొక్కయుపకారము సేయుఁడు మీరలీయెడన్.

క. మీామది శంకాతంకం
బేమియు లేక సభవార లెల్ల వినంగా
నామాటలుగాఁ గొన్ని మ
హీమండలవిభునితోడ నాడఁగింపఁ దగుఁ. 277

క. మండలపతి తప్పొప్పులు
రెండు విచారించి తగినరీతి న్నితర
దండన సేయఁగఁ దగు న
ద్దండము సేయంగ శుభము దలకొన దెందుఁ. 278

గీ. మీార లన్నిట నడినన్నవారు దెలుప
వలదొకో నన్ను నడినన్నవానిఁగా నొ
నర్చుటకు దైవసన్నిధానమునఁ బెట్టి
నిజము సేయించి పిదప మన్నింపు మనుఁడు. 279

గీ. అనఘమతులార నన్నుఁ జిత్రాంగియెదుట
నునిచి తారకాణింపంగఁ గనఁగ నట్టి
కల్ల నావల్ల గోరంత గలిగె నేని
యాజ్ఞ కే నర్హుఁడను జుమీా యని యనుండు. 280

క. కాదే వినుఁ డొక్కటి యిం
కాదేవిని గలది గలిగినట్లు దెలుపు నీ
పై దే నేరము జాణేఁగిన
గా దని యడుగు మనుఁ డామెఁ గట్టిగఁ దెలుపఁ. 281

క. అటుమీాఁదట జగదీశ్వర
ఘటనం బెటు లుండె నటులఁ గా కుండదుగా
యి టనుం డని వారికి నా
దటఁ దాంబూలంబు లిడి యతం డవు దనిపెఁ. 282

శా. దాక్షిణ్యాకరమూర్తి షోడశమహాదానాదిధర్మక్రియా
దక్షా యాశ్రితదీనరక్షణకళాధౌరంధరీసత్కృపా
వీక్షా శాశ్వతకీర్తివైభవరమాభృచ్చోళసింహాసనా
ధ్యక్షా దుర్మదరాట్కిరీటదలనై కాక్షేయకాక్షేయకా. 283

క. యాచనకవినుత వనితా
నేచనకతనూవిలాస శృంగారకళా
సూచనకప్రకవిత్వా
లోచనకందళితహర్ష లోలువహృదయా. 284

స్రగ్విణి.

దుగ్ధవారాశివిద్యోతికీర్తి సుధా
భుగ్ధురీణామనాగోభృగవర్తి దయా
దృగ్ధుతాశేషధాత్రీమరున్నిఃస్వతా
స్నిగ్ధసారస్వతస్నిగ్ధసారస్వతా. 285

గద్యము. ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ ప్రసిద్ధవాగ్వై
భవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత
బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం
బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# సారంగధరచరిత్రము

## తృతీయాశ్వాసము.

---



ధుర్యశౌర్యధైర్య
క్ష్మాధరమూర్ధన్య యాదిగర్భేశ్వర వి
ద్యాధిక వితరణదీక్షా
రాధానుత యచ్యుతేంద్రరఘునాథనృపా. 1

వ. అవధరింపు మివ్విధంబున నవ్వసుంధరావరకుమారుం డగు
సారంగధరుండు మంత్రిపుంగవుల ననిచి యనివార్యధైర్య
ధురంధరుం డై యుండె నంత. 2

చ. అనిపినఁ బోయి వారు నతులై కవిసీతిని నీతి దోఁపని
ట్లని రవధారు ధారుణీ నయంబున నేలెడిసామియానతిం
బనిచిన నక్కుమారుఁ గని మామదిలో ననుమానమొల్లఁ బో
వను విశదంబుగా నడిగి వచ్చితి మయ్య యనేకభంగులన్. 3

క. అధన్యుఁడు గాఁ డన్యుఁ డ
సాధారణుఁ డతఁడు దైవసన్నిధి నతనిన్
శోధన చేసినఁగాక య
శోధన యొండొకటి దలఁపఁ జొప్పడ దింకన్. 4

క. మనవి గల దొకటి చిత్తాం
గిని యీమాఱు వెదరించి కినుకన్ నీవం
కని తప్పిది గట్టిగఁ జెవు
మన నృపులోఁ దానఁ దెలుపు మని యతఁ డనియెన్. 5

చ. అన విని మంచిదే యని నృపాగ్రణి వారల నెల్ల వెంటఁ దో
డ్కొని వెస రాణివాసమునకుం జనినం గని నాతి సెజ్జ ది
గ్గన దిగి జాళువాపసిఁడికంబము చెంగట నిల్చి ముగ్ధ వా
ద్భువ వసివాళ్లు వాడు మొగముం గదియంగ మునుంగు
దాల్చుచున్. 6

క. కొనగోరఁ దీసి కాటుక
కనునీరు చుటుక్కు మనఁగఁ గడ మీటుచు వం
చినతల యెత్తకయుండెడు
నన్నృతోదరి కనిరి రాజనుమతి వారల్. 7

మ. వనజాతేక్షణ కేళికాకలరవవ్యాజంబునన్ వచ్చి ని
న్ననుసారంగధరుండు నీయతులసౌందర్యంబు వీక్షించి మో
హనిమగ్నుం డయి బల్మిఁ బట్టె నని మీ రన్నా రటంచెల్లరు
న్వినఁగాఁ బల్కకుమారునిం దెలిసి రండీ యంచు రాజంపినన్.

వ. మే మానృపాలుకడకుం జని తద్వృత్తాంతం బంతయు
నెఱింగించి. 9

శా. ఏరా యోరి వివేకహీనమతి ద్రోహీ నందనుం డంచు ని
న్నారా నమ్మిన దంతయుం గలిగె నెం తైన న్నగర్లోనికిం
బోరో రారో కొమాళ్లు వావివరుసల్ బుద్ధిన్ విచారింపకే
గారాబుంబినతల్లిఁ బట్టితివి యోగ్యంబే నినున్ జూడఁగన్.

క. అని యనుఁ డని యినుఁ డాగ్రహ
మున నంగారకునిచందమున మండుచు నుం
డిన వాఁ డని గట్టిగఁ జెపు
మని మే మెంతయును దూఱ నతఁ డి ట్లనియెన్. 11

మ. అమరంగాఁ దనమీఁది నేర మిపు డావాఁ నావయిం జూపెఁ
దం, డ్రిమనం బి ట్లిడ నేనెనే యయినఁ గానీ గట్టిగాఁ
దెల్ప నా, యమనే యిం కొకమాఱు మీ రడుగుఁడీ య
న్నాఁడు గాఁగాను దో, నను ను మ్మిందు నిరావనిందలు
గడించం దెల్పు నిక్కంబుగన్. 12

చ. అనవుడు రాజుదిక్కు మొగ మై యలుకన్ గలకంఠి కంచు గీ
సినగతిఁ బేరలుంగునను జిట్టుదుకుం గనునీరు సోన మై
చినుకఁగ నేడ్చి యే లగడుచేసెదు రచ్చలఁబెట్టి యింత యో
వనధిగభీర నాకు నరివారలలోఁ దలవంపు లయ్యెడున్. 13

క. మానముకన్నను హెచ్చా
ప్రాణ మని తెగింపఁ బల్కిఁ బ ట్టిటు నేయం
బూనితి నగుఁబాటులు నా
కా నీకే సిగ్గు గలుగ దఁట నా కేలా. 14

క. కందోయి చల్లగా నిటు
గం దోయిన్నృపాల లెన్నగా నిఁక నొకమా
ఱందఱముందఱ నీ వని
చిందఱవంద ఱయి గుట్టు చిట్టాడంగన్. 15

క. కయ్యానకుఁ గాల్ ద్రవ్వుచు
గయ్యాళితనంబు మీఱఁగా దగ్గఱి యా

తొయ్యలి యూఁచక యూఁచక
పయ్యెద గొంగును బటాన బయలుగఁ జేసెన్. 16

ఉ. ఆవగిదిం ద్రపారహిత యై కుచరేఖలు చూవ నందఱున్
హా పరమేశ్వరా యనుచు నొదల వంచిరి జంత యింతయున్
నావయిఁదప్పెయానిదియు నాదియొ యాతనిచేఁతయానొ కా
దో పరికింపుఁడా యనుచు దువ్వటిముందఱఁబెట్టి వెండియున్.

క. కొడుకువయి నీకుఁ గడుఁ బ్రే
ముడి గావునఁ 'గతకుఁ గాళ్లు ముంతకుఁ జెవు' లీ
వడిగెదవు రాజ నీ కె
క్కడియభిమాన మని పలుకఁ గొంతుం దలుకన్. 18

క. ఇది మాయాపట మనఁ గూ
డదు గద యిఁక సంశయం బెడలఁ జూచితిరే
కద పదపదఁ డని యానయు
విదులం దోడుకొని వచ్చి విభుఁ డలసభలోన్. 19

క. మాతృరిరంసాయుతుఁ డగు
పాతకి దండన మొనర్చఁ బరిమాణం బే
రీతిం జెప్పుఁ డని సద్బుధ
జాతములం గూర్చి యడుగ జననాథునితోన్. 20

క. విజ్ఞాపనం బొనర్చిరి
విజ్ఞానేశ్వరము చూచి విద్వజ్జను ల
య్యజ్ఞనికరచరణాదుల
కాజ్ఞ నిశావేళఁ జేయ నర్హం బనుచున్. 21

ఉ. ఆతఱి వారిమాట విని యట్లనె నిర్దయవృత్తి నమ్మహీ
నేత తలారులం బిలిచి నేఁడు సుతుం గొనిపోయి కాళ్లనుం

జేతులుఁ గోసి రండనుచుఁ జేముదుటుంగరమిచ్చెఁ గోపమే
చూతురుగాని బిడ్డఁ డని చూడరుగా ధరణీతలాధిపుల్. 22

ఆ. పట్టి నట్టు లాజ్ఞ వెట్టఁ గట్టడి నేసి
సరగ లోని కరిగి శయ్య నొరిగి
యినుఁడు దుఃఖవార్ధి మునిఁగి యుండఁగ నల్ల
యినుఁడు నంత వార్ధి మునుఁగుచుండె. 23

గీ. స్వామినుకుమానికమ్ములు భార మైనఁ
దరణి శరనిధి మునుఁగఁగా సరగఁ దిగిచి
వేయఁ బోల్ పైవసుతతి నారాయణుండు
శా కది కృపీటజాతాప్తిఁ గాంచ నేమి. 24

చ. గగనపయోధి దాఁటి రవిగంధవహాత్మభవుండు రేయియ
న్నగతికుమారియంతికమున న్రభసంబున నిల్చి వచ్చు సో
యుగమున రామచంద్రుఁ డని యాయపరాంబుధిలంకఁ జొ
చ్చి పెల్లుగఁ దరికొల్పునగ్నిశిఖలో యన సంధిలె సాంధ్య
రాగముల్. 25

గీ. లోకములకంట నలమ వేలాకృశాంగి
మిహిరకరరన మూనినమిన్ను పెంచుఁ
గదియ సాంధ్యవిభాదీపకలిక యుడఁగఁ
బడినకాటుక యనఁ దమఃపటలి నెఱసె. 26

క. చవుదంతి వియన్నదిలో
నవగాహ మొనర్చి చల్లునలవమధులా నా
దివి యాఁచుక్కలచేఁ దగ
దివియలవారిఁ గొని యవుడు తెగువఁ దలారుల్. 27

సీ. రాగిదేరెడుచొకారపునీలిచల్లడం
 బులడంబు చీఁకట్ల బలము నేయఁ
గోఱమీసములపైఁ గోపోగ్రరసములు
 చిందు ద్రొక్కఁగ మొగాల్ జేవుఱింప
మృత్యుదంష్ట్రి లనంగ మేమైనలోవంక
 కత్తు లున్నతభుజాగ్రముల మెఱయ
నళుకుమానుసులగుండెలు గుభు ల్లన ఘల్లు
 రను మోఁతగురులు వేటాడుచుండ
ఆ. వీఁకె వెట్టి యీల వెట్టుచు బడిబడిఁ
 బాఱు తెంచి చుట్టువాఱుకొనిరి
 దివ్యరత్ననికర దేదీప్యమాన మై
 యతిశయిల్లు రాజసుతుని యిల్లు. 28

వ. అప్పు డందులఁ గ్రందుకొనుసందడిఁ గొందల మంది పరిజనంబు లేడ్చుచు లోపలికిం బాఱి యబ్బారి మొఱంగించిన నిప్పు ద్రొక్కినచందంబున మిట్టిపడి తొట్టిలం బడిన పులుఁగువిధంబున నిట్టట్టు తరలి పోఁగూడక యావద్రావి నవానిగతి నారటించుచు మిన్ను విఱిగి పైఁబడిన క్రైవడి ఱిచ్చవడి రాకుమారుఁ డాత్మగతంబున. 29

మ. జననీ నావయి లేనిదోన మిటు లీక్ష్వాకుం దండ్రితోఁ జెప్పి యా
 యనకుం గోపము వెంచి త్రుంవు మన నాహా యెట్లు
 నోరాడ నైనను జో దా పదసద్వివేకగుణమూర్ఛ ధర్మంబుఁ
 బోకార్చి యా, మ్మనుజాధీశుఁడు వట్లు సేయుఁ దగునే మత్తు
 లదా భూపతుల్. 30

క. ఈలాగున ధర్మము ని
ర్మూలం బై పోవు టెఱుఁగ మునుపే యెట కేఁ
బోలే నైతి నయో విధి
యేలా పో నిచ్చెఁ బ్రాప్తి యిటు లుండంగన్. 31

క. కెరలిపడి జనని దూఱుట
ధరణీపతి సనుట వెత్తి తన మీఁక నేలా
పరితాప మొంద నాకుం
గఱకంఠుఁడె దిక్కు గాక కలరే యితరుల్. 32

క. అని నిర్విచారుఁ డై యా
మనుజేశకుమారుఁ డనుపమానగభీరుం
డనవద్యశుభాకారుం
డనిమిషగిరిధీరుఁ డున్న యంతఁ దలారుల్. 33

క. రానుతుఁ డని తోడిఁబడఁ దెగి
గాసిని బెట్ట కడియాసఁ గాచుక మన మీ
మోసాల నున్న నెక్కడ
మోసా లౌనో యటంచు ముంచినభీతిన్. 34

క. క్రిక్కిఱిసి నగరిలోనికిఁ
జక్కన నురదురన చొచ్చి చనుచో నేమిం
జెక్కు చెమర్పక యుండెడు
నక్కొమరునిఁ గాంచి వార లతిదుఃఖితు లై. 35

ఉ. కానకుఁ గొంచుఁబో యిపుడు గాళ్లను జేతులు గోయుఁ
డంచు లో, నూనినకిన్క రాజు ముదుటుంగర మిచ్చెను
మాకు బుద్ధి యే, మానతి యిందు మీ రనిన నట్లన

నేయుఁడు గొంక నేల రాజాన యతిక్రమింపఁ దగునా యని
యాదృఢచిత్తుఁ డాడినన్. 36

ఉ. ఏమొడఁ గోపగించి ధరణీశుఁడు గొల్చినవారి నేక్రియం
జేయుఁ డ టన్నఁగా దనక చేయవలెం గద యన్న నట్టిటుల్
రాయిడి చేసి కర్కశపురజ్జువుల న్నవమోహనై కరే
ఖాయుతదేహునిన్ విఱిచి కట్టి రహో పెడచేతు లంటఁగన్.

క. చిందె నట హారములు దెగి
క్రొందెలిముత్యములు పెన్నెఱు ల్వీడి విరుల్
జిందెను మును సింగారము
చిందుచు నున్నాఁ డటంట సిద్ధము గాఁగన్. 38

గీ. ఇట్టు లారాచవట్టిని బట్టి చాల
గొట్టు సేయుచు నదురేయిఁ గొంచుఁ బోయి
నఱకుదు మటంచు నప్పు డానగరికడన
యుంచి వా రంత నంతగా నుండె రంత. 39

గీ. అదురుగడ గాఁగ నవ్విధం బందుఁ దెలిసి
బెగడి యేడ్చుచుఁ జేతులు పిసికికొనుచుఁ
జెమ్మరించుచు నోయమ్మ చెల్ల యేమిఁ
సేయుదుమొ యంచు రత్నాంగిచెలులు మిగుల. 40

క. తల వీడఁ బాఱి తమ ఁగా
దిలియేలికసానితోఁ దదీయవిధంబుల్
దెలియఁగఁ జెప్పిన హా యని
నిలిచిన నిలువుననె యొరగి నేలం బడియెన్. 41

గీ. నోరఁ దడి లేక యప్పు డానీరజాక్షి
కంటఁ బుట్టెడుకన్నీరు గాఱఁ బొరలి

పొరలి యేడ్చుచునుండ నప్పోటు కేల
కస్తిపడె దమ్మ యని యెత్తి కుస్తరింప. 42

క. అప్పుడు దెలిసియు మదిలో
ముప్పిరిగొనుపుత్త్రిమోహమున నకియలు తేఁ
గప్పుకొని వెంట రాఁగా
నప్పావనచరిత మహితలాధిపుకడకున్. 43

మ. జిలుగుంబయ్యెదకొంగు జాఱి వెనుకన్ జీరాడ ముత్యాలపే
రులు వక్షోజతటిం బుటం బెగయఁగాఁ ద్రోపాడఁ జన్నుల్ కటి
స్థలిపై వేసలి ముగ్గ పాల్రిల నడుగుల్ చండింప నేత్రాంబుజం
బులు గన్నీట వసంతమాడ నరిగెన్ బూఁబోఁడి ఖేదంబునన్.

క. అరుగునెడ నంతిపురమున
నరవిరిపొన్నపయి నొరగి యావల ధరణీ
శ్వరుఁడును నీవల నొకయం
తరువునఁ జిత్రాంగి చెలులుఁ దా నుండంగన్. 45

గీ. అనఘచారిత్ర యెవ్వ రే మన నొకింత
గరలని సుశీల సంపన్న గేస్తురాలు
అత్తరుణిఁ జూచి యపుడు నో రెత్తి పలికెఁ
దాళవచ్చున పుత్త్రివాత్సల్య మచట. 46

సీ. మగనికూరిమి గల్గి జగములో మిక్కిలి
వన్నె కెక్కినయట్టివారు లేరె
యిల భోగభామినుల్ కులభామినులకంటె
మెరగా నడచినవారు లేరె

నవతివట్లను నీను నవరింప కేవట్ల
గారాబమునఁ బెంచువారు లేరె
నెనరుతోఁ బినతల్లి యని కొమా ల్లింటికి
వచ్చిన దయఁ జూచువారు లేరె
గీ. తగునె యక్కట బుధనుతోదారగుణవి
రాజి సన్మార్గవర్తనఁ దేజరిల్లు
పరమసాధువు సారంగధరునిమీఁద
నొకటికిఁ బదాఱు గల్పించి యోలతాంగి. 47

చ. పడుచుఁదనాన వచ్చి నినుఁ బట్టి పెనంగె నటంచు లేని యా
గడములు గొన్ని యంగమునఁ గానఁబడఁ నవరించి యీసు
చేఁ, దొడిఁబడఁ బోయి ప్రాణవిభుతో నెఱిఁగించి తెగించి
వాని నోఁ, పఁతుక యాజ్ఞ నేయు మని పంచితి వెంతటి
కెత్తుకొంటివే. 48

చ. పొలఁతుక లెన్స యున్న నొకపూఁటయుఁ జూడఁగఁ జాల
వీవు మా, యల కొడిగట్టి తెంతటిగయాళివి బేరజపుఁవిచా
రములఁ, దెలియనివాసిపైఁ గలవి లేనివి చాల ఘటించి తం
డ్రిచే, డ్డల కెడ నేయఁ జూచి తకటా మది నీ కిది యెంత
దోసమే. 49

చ. కటకుఁదనంబుతోడఁ గనుగందని యాత్మఁ దలంప వైరి వి
తైఱఁగు వినం గలుక్కు మనదే పగవారిమనంబు వెన్కముం
దఱలను బిడ్డఁ బావ మమతం గని పెంచినదాన వైనఁగా
యెఱుఁగుదు గొడ్డురాల కిల నెక్కడిమోహము లెంచి
చూడఁగన్. 50

క. పినతల్లని పెనువఁగ నో
పినతల్లని గాన వచ్చి పిలిచిన నయ్యో
కనికరము లేక వానిం
గని కరము నిరాపనింద గట్టం దగునే. 51

చ. కటికిమనంబుతో నిటులఁ గల్లలు చెప్పిన నాతఁ డైనఁ దాఁ
గటకట యిట్టివాఁ డవుచు గాఁ డని రెండును నిశ్చయింపకే
యెటువలె నాజ్ఞవెట్టు మనెనే తరళాక్షి కుమారుఁ డంచు న
క్కటికము లేదె యాఁ జెవులె కన్నులు రాజులకుం
దలంపఁగన్. 52

ఉ. ఏనడిన న్నమానిసివో యేమి యెఱుంగవు పాఱుపట్టివే
వేసర కిన్ని నేరిచితివే మఱుమాయలనీలి కాన యో
మాఁసినము త్రైమై వెలుఁగు ముద్దుఁగుమారునిమీఁదనెట్టుగాఁ
జేసితి వింత మచ్చరము చెల్లు నటే మఱి యాఁడుదానికిన్.

క. అని తా నాడినమాటలు
విని తాళఁగ లేక బిగువు వెలయఁగ నపు డ
వ్వనితామణి యిట్లనియెన్
జనితామర్ష మునఁ జూపు జంకెనఁ జూపన్. 54

చ. జలరుహనేత్ర నన్నిపుడు సారెకు దూఱుచుఁ గేరి నిక్కు
చున్, నిలుగుచు విఱ్ఱవీఁగుచును నిక్కము గాఁగను నాతఁ
డేమియున్, దెలియఁడు సాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ
దేల నాడి గా, దిలిసుతుచేఁతఁ జక్కటులు దిద్దెద వెంతటి
నంగనాచివే. 55

ఉ. వేదులు వల్కిన న్నదర వ్రేయఁగఁ జూచెద విందు నంతయుం
బేదలు లేరు నీవు కదుఁ బెద్దఱికా ల్పచరించి యూరకే

వాదులు చేసి దేల చెలువా యవుఁ గా దనువారు లేరఁటే
సాదువిసాళి నీదుతనుజాతుఁడు వాఁ డలపిన్నపావఁడే. 56

ఉ. ఎంతకు లేఁడు బాలుఁ డనియే పచరించెద వింతె కాక నా
చెంతకుఁ జేరి నీకొడుకు చేసినచేఁతఁ దలంప నైతి వో
కాంత నిజంబె యోరికిని గాశికిఁ బోయినసుద్దులే ప్రకా
శింతురు గాని యానడుమఁ జేసినదోసము లెంచ రే కదా.

ఉ. ఏల బజాఱిఱంతు లివి యెవ్వరు మెత్తురు నోరిలోపలన్
వ్రే లిడినప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపావ గాఁ
డే లలితాంగి నీ సనక యే రిఁక నందురె యాయెఁ బొమ్ము చా
ల్చాలును వ్రేళ్ల నందులను జాణెడువారలు లేరె యెవ్వరున్.

క. సూనుఁ డసి చాల నెంజిలి
యానిదు గా తల్లి దోన మన కిటు బలిమిన్
బోనీక పట్టి పెనఁగిన
వానిన్ మఱి యేమి సేయ వలయుం జెపుమా. 59

వ. అని పలికినచిత్రాంగిపలుకులు చెవులకు ములుకులపోలికఁ గీల్కొన నచ్చిలుకలకొలికి యులికిపడి యాచెంత నున్న మహీకాంతునిఁ గని యి ట్లనియె. 60

క. మతకరిమాటలు చెవి నిడి
గతకల్మషుఁ బుణ్యచరితుఁ గారణజన్ము
సుతుఁ దునుమఁ దగునె ముద్దుల
రతనమ్ము నయో యి దేదొరతనమ్ము నృపా. 61

చ. పెనఁగినఁ బోవ నీక పసిబిడ్డఁడు వాఁ డఁట యమ్మచెల్లగా
దనఁ దను నంట వచ్చె నఁట తక్కినమాట లిఁ కేల చూచి
యున్, వినియు నెఱుంగ మయ్య యివి వింతలుచెప్పెడివారు

చెప్పిరట, వినియెడువారి కైనను వివేకము దా వలదా యొ
కింతయున్. 62

మ. తొలుత౯ రాజులు భోగకామినులయందు౯ మోహితుల్
గారొ యిం, పొలయ౯ వారి కపారమైనధనమీరో యందు
కే మిట్లు పు, త్త్రుల దండింపఁగ నిచ్చు వారి విన మెందున్
నేఁడు చిత్రాంగి మం,దులు నీకుం దల కెక్క నాఁ బరవశా
త్ముల్ గారె కామాతురుల్. 63

ఉ. అక్కట చూడఁ జాల కటు లాకుటిలాలక మాయ వన్ని దు
ర్వాక్కులు దెల్ప వాని కిటువంటిగుణంబుల నేనెఱుంగ నా
యొక్కడిమాట పొమ్మనక యీ వది నిక్కము చేసి బిడ్డ న
య్యొక్కని నేఁడు చంపఁగ నయో దయమాలి తెగింపఁ
జెల్లునే. 64

క. ధరణీపతు లే రొకటియుఁ
బరికింపక యిట్లు లదయభావమున ఘటిం
తురె యౌఁ గద 'రాజ్యాన్తే
నరకం ధ్రువ మ'నిరి తొంటినయమార్గవిదుల్. 65

చ. చలమునఁ జెప్పుమాటలు నిజం బని కానక కన్నవట్టి ని
గ్గ్రలు వధియించె నింతదయమాలినవాఁ డని లోకులాడరే
వలపున స్త్రీలబుద్ధి వినువా రొక రేఁ గద తేరినట్టివా
రలు గలరా వివేకము కరం బిటు లయ్యె ని దేల వల్లభా.

ఉ. ఇచ్చక మాడ నిట్టి వెలయింతుల నెందఱనే గడించుకో
వచ్చుఁ గుమారుఁ డిట్టిగుణవంతుఁడు గల్గఁ డెఱుంగఁ జెప్పి
తిర౯, మచ్చర మేల యింక నయిన౯ విడిపింపఁగ రాదె

యంచు లో, హెచ్చినవెంజిలి న్మగువ యొమ్ములు చిల్లులు
వోవ నాడినన్. 67

గీ. మదిని ద్వేషంబు కోపంబు మొల్లడిగొన
నిలువ కట రాగ మతనికన్నుల వసించెఁ
గటుమరలఁ జేరె నవు డనుకంపమహిమ
చనుని దుర్జనసంగతి సాధువులకు. 68

ఉ. ఏనటు వేఁటఁ బోవఁ గని యిందులకున్ బెళు కావగింజయుం
తైనను లేక చేయి నగునా తగునా యన కింత నేనినే
వానికిఁగా వహించుకొని వచ్చితివా యతివా కులోద్భవాలుం
డో నఁట బుద్ధి దా నెఱుఁగఁ డందమె యందమె యిట్టిచం
దముల్. 69

చ. అది మటుమాయలాఁడి యని యంటివిగా యొకనాఁడు
రానివాఁ, డమరుగడం దదీయనిలయంబున కేటికి వచ్చె
నైన నిం, పొదవినప్రేమచే నచట నుండఁగ వచ్చెనె వాఁడు
పోవ ని, మ్మదియు నిజాంశుకంబు తగు లౌటకుఁ గారణ
మేమి దెల్పుమా. 70

క. జనపతి యా లని బిడ్డని
యనుఁగుంజుట్టమని చూడ నగునే యొందున్
దునియలుగ నాజ్ఞ వెట్టక
నెనరున మఱి నేయరానినేరము నేయన్. 71

చ. అనిరొయొకయించు కైనఁ దనకాస్పద మీా కతఁడాడఁజూచి మా
నిని యిటుఁ గూడ వానిపయి నేరమి యూరక మోపఁ జేసితో

జనవర నిక్కమౌ నవును నభ్యయు నీప్రియురాలె వాఁడె దు
ర్జనుఁడు వెమళ్ల వందిరియు రాజులమాటలు నిక్కమౌఁ గదా.

చ. అడవుల కేఁగి యాకలములైన భుజించెద మయ్య దీమనం
బెడలఁగ దూరదేశముల కేనియుఁ బోయెద మయ్య కోడలుం
గొడుకును నేను రాచసిరికూటము లప్పుడె వచ్చె మాకుఁ జా
ల్విడువుఁ డనంగదయ్య నవవిభ్రమమోహన కోమలాంగునిన్.

గీ. అని యపుడు నిల్పరాని మోహంబుకతనఁ
దనదు ప్రాణేశ్వరుని పదద్వయము మీఁద
వేగ తా నడ్డపడి మైన వేఁడుకొనెదఁ
గాక యని చేరఁ జనుదెంచుకడఁక యెఱిఁగి. 74

శా. నామీఁ దాన సుమీ మ తేమి యనిన న్మా తాడఁగా
వచ్చినన్, వామాక్షి యతిఘోరపాతకునిఁ గావం జెల్లునా
వాని నీ, వేమేఁ జెప్పిన వింటుఁ గాని విన నే నీమాట హో
హో మ్మనెన్, మోమో టించుక లేక యెంతకఠినాత్ముల్
రాజు లూహింపఁగన్. 75

గీ. అనిన గజయాన పతియాన కరిభయాన
క క్రియానల ధా య్యానయక్రమగతి
యాన గజగజ వడఁకి శయాన తత్ప్రి
యాననము గని తాల్మి నయాన నవుడు. 76

క. మనసు నిలుపఁ జాలక కడు
పునఁ బుట్టినదోసమునకుఁ బొగులుచు వేఁడం
జనుదేర నానఁ బెట్టితి
వని లే దిక వానివ్రాఁతఫల మిటు లుండెన్. 77

క. అని చాల ఖిన్నురాలై
మనమునఁ దెర వేయఁ బుత్త్రిమమతాంబుధి ని
ల్చినచోట నిలువనైఁ వక
వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతన్. 78

ఆ. భామలార రండు నాముద్దుతనయుండు
వేఁడి వేఁడి యనుచు వేఁడి వేఁడి
వేఁడి వేఁడినీరు వెడఁదకాటుకకంటి
కొలుకులండ మాటి కొలుకుచుండ. 79

చ. వల దని మీర లైన నొకపాల్ దెలుపం గదరయ్య యాలి
మా, టలు విని యన్నఁబట్టి నకటా తెగటార్చిరె యంచు నా
మె పెద్దలఁ గని పుత్త్రిమోహమున దైన్యపడెం గడు రాజు
మొత్తగా, నలమొగసాలకు న్నార యఁటన్నది నిక్కము
గాఁగ నయ్యెడన్. 80

మ. తొలఁగం ద్రోయఁగ రాక మూఁక లయి వీథు ల్నిండియు
న్నమ్మల, క్కలు తన్నుం గని పైన పైన పడుచుం గన్నీళ్ళతో
వెంట రాఁ, జెలికత్తెల్ మును గల్గుమార్గము బయ ల్సే
యంగ రత్నాంగి గా, దిలిగారాబుఁ గుమారుఁ డున్నకడ
కేతెంచెన్ నితాంతవ్యథన్. 81

సీ. సుతుఁ డట్టివాఁడు గాఁ డతివమాటల కేమి
యని తాళఁ డాయె రా జనెడివారు
నెవ్వరిమన మెవ్వఁ డెఱుఁగు నన్నము పున్న
మును దేవుఁ డెఱుంగు ననెడివారు
విభుఁడు ధర్మాధర్మవిధము కానక చేసె
హా యెంతయన్యాయ మనెడివారు

స్వామి యయెూ పగవారికి నిటువంటి
    యాపద రావల దనెడువారుఁ

గీ. గపట మెఱుఁగవు గోలవు గదర యన్న
యెట్లు వచ్చెర నీకు నేఁ డిట్టిపాటు
లనుచు సారంగధరుఁ జూచి యమ్మలక్క
లపుడు కన్నీళ్లు గలవార లయిరి పురిని. 82

సీ. ఉపకారమే కాని యపకార మెన్నఁ ద
    లంచఁ డయెూ యెంతమంచివాఁడు
మనసు చూత మటంచుఁ దను నే మనిన నవ్వుఁ
    గాని కోప మొకింత లేనివాఁడు
మదిలోన నెవరి కెయ్యది యిష్ట మది యట్ల
    నలరించునుచితజ్ఞుఁ డైనవాఁడు
భువిఁ గలఁడా యిఁకఁ బుట్టెను పెరిఁగెను
    వారిలో మఱి యిటువంటివాఁడు

ఆ. పరమసాధు వనుచుఁ బలుమాఱు సారంగ
ధరునిగుణము లెల్లఁ దలఁచి తలఁచి
పౌరజనము లెల్లఁ బసిబిడ్డ లాదిగా
వగచి కస్తిపడనివారు లేరు. 83

గీ. జిత్తులకుఁ డెంకి యగునింద్రజిత్తుచేత
నలయురగపాశబద్ధుఁ డై యలయునట్టి
రాముతో డన మిగుల గారాముతోడఁ
పెంచినకుమారుఁ గాంచి పెం పెంచి కనలి. 84

మ. అపు డమ్మానిని యెంత నేసితివె చిత్రాంగీ యటంచుఁ
జోకా, రవుఁ గేల్దమ్ముల నగ్ర కుంతల తటీ రాకా నిశాకాల

గీ. శ్రవమాన్యంబున మోఁదికొంచు సుతుపై నుద్బాష్ప
మై వాలెనం, దుపకంఠ క్షితి బద్ధ తర్ణక దివ్య క్షోద్రిక్త
ధేనుక్రియన్. 85

ఉ. రంగ దపార మోహ జలరాశి మునింగి రహిం దొరంగి ర
త్నాంగి యొకింత సేపటికి హా సుకుమార కుమార నేఁడు చి
త్రాంగికి నప్పగించుకొనుకా నవమానములన్ భరించి వే
డ్కంగని నిన్నుఁ గూరిమి గడల్కొనగోమున నెత్తిపెంచుటల్.

సీ. బహుభూషణధురీణ బాహువల్లరులకా
కటకముప్పిరిగొల్ప విటిచికట్లు
మృగమద శ్రీగంధ మిళిత దేహమునకా
గాటంపుఁ గెంధూళి కప్పడములు
శిబికావతంస రాజిత పదాబ్జములకా
యీడుపుతోట్రుపాటెల్లిదములు
జాతి చంపక దామ వీత కేశములకా
యట్టిట్టుజీరాడు నద్భికములు

గీ. నెండకన్నను నీడకన్నఁ గనున్న
పుట్టుభోగికి నయ్యోఁ బో యిట్టి వెతలు
కడువు దరికొనదా వీనిఁ గన్న యపుడె
యన్న యెటు లోర్తురా ననుఁ గన్నతండ్రి. 87

శా. నిన్నున్ సద్గుణవంతుఁ డంచు నెపుడు న్వేనోళ్ల మెత్తుగదా
యన్నా నేఁ డిది యేమి సేసితివి యేలా పుట్టి నీదూఱు నీ
కిన్నాళ్ళే నిది చెల్లఁబో జననిగాదే యల్లచిత్రాంగి దా
నన్నుం జూచినకంటఁ జూడ వలదా నామాటుగా నాయమన్.

ఆ. వరులమఱ్ఱి చూత్తి పలుకనివా రన్య
భామినులకు నాసపడనివారు
దలఁచి చూడ దేవతానసూను లనంగ
వినవె నీతి యేల వేదు రైతి. 89

క. పొలియుటకు నేమి యొందుఁ
గల దందుకు వగవ మది జగన్మోహనకో
మలుఁడ వగునీకు నీవిధి
నలచతురాననుఁడు వ్రాయ నగునా యకటా. 90

క. నానావిభవములం దగ
నే నినుఁ జూతు నని యున్న నిట్లాయె నయో
తా నొకటిఁ దలఁప దైవము
తా నొక్కటి దలఁచు ననుట తథ్యం బయ్యెఁ. 91

సీ. ఒకమంజువాణి పాయక మొగంబున వ్రేల
సొంపొంది నురసేవఁ జొక్కువాఁడు
వాసిగాఁ బంకజాతాననుం డనునుడి
వడివాఁడు రాజనప్రకృతివాఁడు
పాలుపా లనుచుండఁ బసిబిడ్డల ,హరించి
దంద్రికి దోహంబు దలఁచువాఁడు
దా నదానసత్త్వవర్తనుఁడు నేఁత వికారి
తన మరాళగతి యేతఱిని విడఁడు

గీ. నలువ నలువగఁ జూడఁగాఁ దులువ గాఁడె
యతని నసఁ బనియేమి లోకాధిపత్య
మేచి యందఱ లోఁ దల యెత్తికొనెడు
నటులఁ జేసినయీశ్వరు ననుట గాదె. 92

మ. అని శోకించుచు నున్నతల్లిఁ గని యమ్మా నేను జిత్రాంగి న
ట్లనె నీమాటలుగ నే తలంపుగను మరులాన్చటిల్లి యాయమ్మ న
న్నినచుల్ గోరిన నియ్యకోక కడకే నేతెంచితిం గాని పా
వని యేదోసము నేనెఱుంగను మనోవాక్కాయకర్మంబులన్.

ఉ. అమ్మరో పోలుపొందెఱుఁగ కమ్మను జేర్చనుఁ డాలిమాట ని
క్కమ్మని రోయఁ బంచె నరగన్ సభవారు నుపేక్ష నేసి నా
యమ్ము దలంప కిచ్చకమె యాడిరి యేమనవచ్చుఁ గన్న వా
హామ్మున నీకుఁ బోదుగను కా ర్తిఁదలంకుచువచ్చి తియ్యెడన్.

గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన
తల్లి కీదల్లు వచ్చెఁగా దన్నుఁ గనుట
వల్ల నీ వల్లధారుణీవల్లభాజ్ఞ
మీఱి యీరీతి వచ్చుట మే రఁ టమ్మ. 95

చ. అడలకు మమ్మ నీవు కల నైనను రాజును దూఱకమ్మ యే
యెడల సపత్నితోఁ జెలిమి యుంచుకదప్పకుమమ్మ నాదునం
గడిఁజరియించు నాదుచెలికాండ్రను నావలెఁజూడవమ్మ యిం
పడరఁగ న న్నిఁక న్మఱవవమ్మ విచారము మాని మానినీ.

క. జననీ విచ్ఛేయుము నీ
వనుచున్ సాష్టాంగవినతుఁ డై తేవనిచో
ననుఁ గఱుదులపోవ వగుతన
యనుఁగరుదులబిడ్డఁ జూచి యవనతకర మై. 97

క. లేవోయి యన్న రేవటి
దీవన నేకోదువ లేక దీర్ఘాయుఁడ వై
దేవునికృప వర్ధిల్లుము
నీ వని దీవించి మిగుల నెగు లుప్పొంగన్. 98

ఉ. కందుఁ గదయ్య నీమురువు కన్నులపండువు గాఁగ నంటినం
గందుఁ గదయ్య నీతనువు కౌతుక మొప్పఁగ నీదుప్రాపు నేఁ
గందుఁగదయ్య యంచు నినుఁగన్న సవత్నిసహింపదందుఁ బో
కందుఁ గదయ్య యేల వినవైతివి నావచనంబు పుత్త్రికా.

సీ. చంద్రోదయం బైన చందాన నీరాక
కన్నులు చల్లగాఁ గాంతు నెపుడు
నినుఁ గొండఁ గాఁ జూచుకొని యేవిచారంబు
లేక యుండుదు నాత్మ లేక మైన
నిసుమంతదడ వైన నీవు రాకుండిన
నది యేమొ రాఁ డని యెదురుచూతుఁ
దెలియఁ జూచినయెడ దృష్టి దాఁకునో యని
వేడ్క దీఱఁగఁ జూడ వెఱతు నిన్ను

గీ. నెటువలెఁ దరింతు నీరూప మెచటఁ గందు
నీ విఁకను వత్తు వని యెందు నెదురుసూతు
మనసులో నిన్ను నేలాగు మఱవ నేర్తు
నీవు లేనిది యొక బ్రతు కే కుమార. 100

క. తనయూత్మకు వేగిరాయెని
తనయా యిపు డెంత నేనె దైన మయా నిన్
తనయానిక నెటులఁ దరిం
తనయా ప్తిని నే నభాగ్య నగుజంత నయా. 101

సీ. జననవేళలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
వెలయ లేఁ డని నాఁడె దెలుప రైరి
కరము రేఖలు సూచి ఘనుఁ డౌ ననిరి గాని
ప్రబలలేఁ డని నాఁడె పలుక రైరి

గతిలక్షణము నూచి ఘనుఁ డో ననిరి గాని
యీడేటిఁ డని నాఁడె యెంచరైరి
యనుపమాకృతిఁ జూచి ఘనుఁ డో ననిరి గాని
కడతేటిఁ డని నాఁడె నుడువరైరి
గీ. కటకటా నమ్మఁ దగ దేడ గ్రహబలంబు
నేడ సాముద్రికము లేక నేడ చిన్న
లేడ ఘనగాత్రమహిమలు నేడ సుద్దు
లంచు రత్నాంగి సుతుఁ జూచి యులమటించు. 102

క. పలవించుఁ బల్లటించుః
బలపల కన్నీరు నించుఁ బసివాఁ డంచుః
విలపించుః బొలు పెంచుః
దలవరులకు నప్పగించుఁ దల యటు వంచుః. 103

చ. కనుఁగొని మూర్ఛిలుం దెలియు గాసిలు నొదలయూఁచు
నేఁటితో, నిను నెడఁబాసి పోవలనె యని యక్కునఁ
జేర్చుఁ బోదునా, యను నటుఁ గొంతపోవు నుసురంచు
వెసం జనుదెంచుఁ దొట్రుపా, టెనయు లతాంగి కన్నకడు
పేగతి నోరిచి యుండు నక్కటా. 104

క. ఇటువలెఁ బెక్కుదెఱంగుల
నట వనటఁ దొలంగి రాక యాఱటపడఁగాఁ
దటుకున నిటు రా జెఱిఁగిన
నటమట మగుఁ గార్య మనుచు నాళీజనముల్. 105

ఉ. చేడియ రమ్ము వెన్నెలయుఁ జీఁకటివంటివి నుమ్ము మేలునుః
గీడును గొంతకాలము సుఖంచినవార కృశింతు రార్తిమై

నాడికె లొందువార సుఖ మందుదు రోడలు బండ్ల వచ్చుబం
డ్లోడల వచ్చు నీకు నిటు లూరక చింతిల నేల మానినీ. 106

వ. అని యూఱడిలం బలుకుచు నిరుగడలఁ జేతులు పట్టి తిగు
వం దిగువం బడియున్న మగువం దిగువఁ బౌర్ధనఖివారంబు
బలాత్కారంబున నెట్టకేలకుఁ బట్టి తీసినఁ బట్టి నెడఁబాసి
గాసి యగు నెగులునందనుం గనుంగొని పురజనంబులు పుర
పురం బొక్కుచుఁ బురిన్కరింప సత్త్వాంగిఖిన్నత్వ మొంది
మందిరంబునకుం జని తనుజుని గుణబృందంబుల డెందంబునం
దలంచి నోరు గాయ వడఁగ నద్దేవి పరిదేవనంబు గావించు
చుండె. నంత నాక్షణంబున నగరరక్షకు లక్షీణనిశితకౌక్షే
యక ప్రకాండప్రచండభుజాదండులై దండధర కింకరుల న
నుద్దండత గండు మెఱసి రసామండలాధిపకుమారుం గొని
పోయి నిజశితనిషాణ రణ శబ్దగుణవారణాహ్వాన సంవిధాన
సూచక మస్తకోపరిన్యస్త ప్రత్యాకుంచిత హస్తప్రశస్తాద
భ్రవిభ్రమ ధురంధర దిక్కూలంకష సింధురఘీంకార సంకు
లంబును నక్షుద్ర మాధురీధురీణ క్షౌద్రలిలిక్షు జిహ్వావల్ల
వాగ్ర చాప లాచ్ఛభల్ల ఖర నఖరభల్లముఖవిదళిత బహు
నాకుకుహర ముహుర్ముహు ర్బహిర్నిర్గళ త్సర్గళ కుండలి
మండలీ గ్రసన వ్యసన సముల్లస ద్వనమయూర కేకాకుల
వ్యాకులంబును ననేకోలూకముఖ త్రోటికోటి త్రుటిత కో
టర నిద్రాణ కరటకు లోడ్డయన గరుత్పుటల పటపటార్భటి
కా విఘటిత నిద్రాతంద్రా విద్రాణ కపి కంపిత శాఖిశాఖా
సహస్ర పరిపతిత పరిణత ఫల రసప్రపూర పూరిత నానా
లతాలవాలవలయంబును బ్రవృత్త సంవర్తసమయ సము

స్షిద్ర సముద్ర సలిల గాధావగాహ దుర్విషహ సర్వంసహా
సముద్ధరణచణ శాంబరీకిటి విడంబనాడంబర లంపట ఘోర
తర ఘోణానిఖాత త్స్మాతలగర్భ నిర్భరబల స్తబ్ధరోమస్తో
మాస్తోకనిర్ఘాతపాత స్ఫీతభీషణ ఘుర్ఘురనిర్ఘోషణా చంకం
వ్యమానద్రుమపరంపరా భయంకరంబును దుర్ధర్షత రామ
ర్షి ప్రపంచిత చపేటికా నిహత బహుళ మాగిన గణ గళ
గళిత రుధిరధారార్ద్ర చరణవిన్యాస దీపిత నిజపద్ధతి నివే
దిత వ్యాఘ్రసమూహ దురవగాహంబును నై సత్త్రంబు
గావున సకలద్విజాశ్రయం బై వనంబు గావునఁ బుండరీక
నిలయం బై కాననంబు గావున సకలాగమరమణీయం బై
కుంజరహిత స్థలంబు గాకుండియుఁ గుంజరహితస్థలం బై
సుమనస్స్థానంబు గాకుండియు సుమనస్స్థానం బై పల్లవా
గమ్యంబు గాకుండియుఁ బల్లవాగమ్యం బై యొప్పునక్కాం
తారంబు సొచ్చి యచ్చట సకాలసంధ్యారాగవదభ్రంకష
చిటాచిటార్భటీ సట చ్ఛటులదావపావకోత్కీలం బైన కు
త్కీలంబునో లంబున నిల్పి తా మంతకు ముందుగ నృప
సత్తముచేత మూఁడుత్తరములుఁ గొన్నవా రగుటం జేసి
యానత్పురుషారాధ్యుని వధ్యశిలమీఁద నునిచి యయ్యెడ.

సీ. హిమశైలజాజానియెదురుకట్లకుఁ బోని
  యలయించువిలుకాని చెలువువానిఁ
గళలు వెచ్చము గానికలువవచ్చెలికాని
  మురువుఁ గిమ్మన నీనిమోమువానిఁ
గనటు లేనికడానివసిఁడి నించుక యేని
  నరకు సేయనిమేనిచాయవానిఁ

గలికితుమ్మెద యాని నలుఁగనివిరిఁ బోని
మొలకప్రాయముఁ బూని యలరువానిఁ
గీ. గరగరనివాని ముఖవిలోక ప్రవర్ధ
మాన మోహ పయోరాశి మగ్న యువతి
జన హృదయ సంగ తాంగజ జ్వలన సామి
ధేని యగువానిఁ జిఱుతుకతేనిఁ జూచి. 108

క. ఎటువలెఁ దునుమఁగ వచ్చుఁ
గటగట యీతలిరువంటికరపద మనుచుఁ
బొటబొట కన్నీ రొలుకఁగఁ
గటకటపడి విన్నఁదనము గడలుకొనంగన్. 109

ఉ. ఉన్నతులారులం గని ప్రియోక్తుల నాతఁడు మీరు నాకు నే
నెన్నఁడు మీకు నెగ్గు ఘటియించుట లేదుగదా నృపాలుఁడో
మిన్నక యాజ్ఞ వెట్టుఁ దన మీఱఁగ వచ్చున మీకు నేటికి
భిన్నత నొందఁ జేయఁ దగుకృత్యము సేయుఁ డటంచుఁ
బల్కినన్. 110

చ. తలఁపుము నీకు నిష్ట మగుదైవము నావుడుఁ దల్లిదండ్రులన్
దలఁతు నటన్న నిర్దయతఁ దామె తెగించిరి ధర్మదేవతన్
దలఁచెదనంటినా యనఘు దండ్యునిఁగా నొనరించెఁ దల్లిదం
డ్రులు నీఁక దైవముం దన కుదుప్రభు శేఖరుఁ డేతలంపఁగన్.

చ. అని హృదయాళుఁ డాయన దయాళునిఁ గాలుని సంహ
రించి మిం, చినఘునునిం గరంబు విలసిల్లఁగ దివ్యపదం బొ
సంగువే, ల్పును బరమేశు శంకరుని లోకశరణ్యుని భక్త
వత్సలుం, బెనఁగొనుభక్తి హృత్కమలవీథి దృఢంబుగ నిల్పి
యుండఁగన్. 112

గీ. ధర బహుళపక్షమునఁ గదా కరపదంబు
దఱుఁగవలయును సారంగధరున కరయ
గతబహుళపక్షమున నలకరపదంబు
దఱుగ వలసెను సారంగధరున కవుడు. 113

గీ. వాఁడికత్తుల నెత్తురు వఱద గాఁగ
హర మహాదేవ శివ యని యతఁడు వల్కఁ
దఱిగి తలవరు లావిపత్కరుఁడు గాని
రాసుతు విపత్కరుఁడుఁ గాఁగఁ జేసి రవుడు. 114

ఉ. లా వగు నట్టిదుర్దశయలంత సహింపఁగ లేక యశ్రుధా
రావళి గాఱ హా జనని హా జనకా యని బిట్టు గాఁగ వా
పోవుచు జొత్తుపావ యనఁ బొల్పగుదేహము రక్తసిక్తమై
భూవరనూతికీలెడలుబొమ్మవిధంబున వ్రాలె భూస్థలిన్. 115

గీ. అతఁడు వడియెదుదురవస్థ కాత్మఁ బొగిలి
కొంతతడవు నికుంజంబుపొంతకుఁ జని
తాంతతనుఁ డైనయతనివృత్తాంత మెల్ల
నరసి పోదము గా కని యటఁ దొలంగి. 116

చ. తలవరు లేఁగ లేఁగవులితండము నెత్తుటిగాలుకై హాళా
హాళిమెయి రాఁగ బోఁగ లయినట్టివృకంబులు కొన్ని బొదల్
రొదల్, చిలుకుచు నీఁగ నీఁగలును జీమలు దొంతరగాఁగఁ
బైపయిఁ, బిలపిల మూఁగ మూఁగవలె బెగ్గిలి పల్కఁగ
లేక వేదనన్. 117

క. సొమ్మసిలి కొంత తడసినఁ
గ్రమ్మఱఁ దెలివొంది లేచి కం దెఱచి సమీ

పద్మున నెవ్వరిఁ గానక
నుమ్మలిక లెనంగ ననువు లూటాడంగన్. 118

చ. అలఁతి సహింపరాదు తెగటార్చురు రం డివు డెందుఁ బోతిరో
తలవరులార మీ రయిన దగ్గఱ వచ్చి వధించి పోవరే
యలమట కోప నోమృగములార యహో దవకీలలార తీ
బొలియఁగఁ జేయరే వెతలఁబొందఁగ లేననిరోయు వేమఱున్.

గీ. కుపితమానసుఁ డై వృథా కోయుఁ బనిచె
నకట యిటువంటికుత్సితుఁ డెం డై నఁ గలఁడె
కాలుచే గోతఁ బడలేక కడకుఁ దోలఁగఁ
గాలు చే గోఁతఁ బడఁ జేనెఁ గా లతాంగి. 120

సీ. దొరలచిత్తంబు లెకరణిఁ బాటిల్లుఁ గా
యని అండ్రియుపి వెకమునకు నడలుఁ
దరళలోచనల నెతటి నమ్మరాదు గా
యని పినతల్లిమాయలకుఁ దలఁకు
నేమి చేసితి నేర మిటు నేయ దేవుని
కిని బాడి లేదు గా యని గలంగుఁ
దొలిమేన నెవరి బాములను బెట్టితినో కో
యనుభవింపక పోనె యనుచు వగచు

గీ. సచివసుతుమాట నిజ మని సారెఁ బొగడుఁ
గొంతనే పేడ్చుఁ జింతించుఁ గొంత ప్రొద్దు
శర్వ శంకర శశిధర శరణు నాకు
నీవె యనుచును నొడవు నొకింతతడవు. 121

గీ. ఇటువలె ననేక గతుల నార్టము నొంద
గగనభారతి వానిపైఁ గరుణ వొడమి

యడలకు కుమార నీ కిది గడవనేర
దెట్లనినఁ బూర్వవృత్తాంత మెల్ల వినుము. 122

క. ధరమ్మై మోహనబింబా
ధరమ్మై రిపుభయదహయ మదావళ వీరో
త్కరమ్మై మహాసింధురమా
కరమ్మై కౌశాంబి యన నొకపురంబమరున్. 123

క. ఆనగర మేలురాజా
జ్ఞానయబలశాలి సత్యసంధుఁడు సుగుణాం
భోనిధి శ్రీహరిపదసే
వానందుఁడు ధవళచంద్రుఁ డనఁగాఁ బరఁగున్. 124

గీ. అతని కేవురు సతు లుండు రందులోన
భువనసుందరి యనియెడుభోగవతికి
మేలువాఁడు ధరాతల మేలువాఁడు
మేదినీంద్రులలో నెల్ల మేలువాఁడు. 125

పంచచామరము.

అమాత్యు లిద్ద ఱుండు రా ధరాధినాథుచెంగటన్
సుమంతుఁడున్ జయంతుఁడున్ వసుంధరాసురాగ్రణుల్
సమానశీలు రందులో వలంతి యంచు రాజు స
త్తమై సుమంతుమాట వించు గారవించు నెంతయున్. 126

గీ. అందుల కసూయఁ గఱకఱ మంచు మిగుల
దుష్ట కపటవిచారవంతుఁడు జయంతుఁ
డంతకోపముఁ దవురా సుమంతుఁ డనుచు
నంతకోపముతో నుండు నాత్మలోన. 127

క. అటు కొంతకాల మరిగిన
నట వాఁడు సుమంతునకు మహైశ్వర్యం బు
త్కటమై గడియ కుడుకునీ
రటువలె హెచ్చిరిలి రాఁగ నతిమత్సరుఁడై. 128

గీ. భువనసుందరియింట నెప్పుడు వసించు
గుట్టుగలదాని మిక్కిలి గట్టివాయి
దానిఁగాఁ గేశి యనుదాని దాసి నొకతెఁ
దనకడకు బిల్వఁ బంచి మంతనమునందు. 129

క. విలువల్ దెలుపం గూడని
వలువల్ మణిభూషణములు వలసినధనముల్
చలువల్ దొలఁకుకదంబము
ఫలు నందఁగ నొసఁగె సంతసిలి కర దనియన్. 130

గీ. ఒసఁగి యయ్యగ్గలికరాజ్ఞయుగ్గ మాత్మ
హస్తమునఁ బట్టి రాఁదీసి కుస్తరించి
నీవలన నొక్కకార్యంబు గావలయును
జేసెదే యని మొఱక మింత నేసికొనుచు. 131

క. మతిమంతుఁ డని సుమంతునిఁ
బతి మన్నన సేయు నన్నుఁ బలుచగఁ జూచున్
సతతంబు దాన గర్వా
న్వితుఁడై యున్నాఁడు వాఁడు నీరజనేత్రా. 132

క. వాని కపాయము సేయం
గా నై నయుపాయ మొకటి గల దది నీచేఁ
గాని మఱి యెవరిచేతం
గానేరదు పరులు దెలియఁగా రాదు సుమీ. 133

గీ. కికురువెట్టి సుహాంతుబాదుకలు గొంచుఁ
బోయి యెవ్వరుఁ గనకుండ భువనసుంద
రీవరారోహామంచముక్రింద నుంచి
మాయమనములోనినగు లార్పుమా మృగాక్షి. 134

క. అనిన నది యొంతొ గల ద
ట్లన నేనెద సంచుఁ జని యటుం చా నొకనాఁ
డును బెట్టుకొని యెలంగని
యను వైనసుమంతుపావ లది లాగించెఁ. 135

క. ఆలాగునఁ గొనిపోయి నృ
పాలప్రియుపాన్పు క్రిందఁ బాదుక లిడి యా
లూలామాలవు నాలి గ
యాళి తనుం గానిదానియటువలె నుండెఁ. 136

వ. తదనంతరంబ. 137

సీ. గమ్మన వాసించు కమ్మపువ్వుల సరా
లొఱవుగా సిగఁ గొంత యొఱగఁ జుట్టి
కళలు దేఱెడునెమ్మొగమున సైకముగాఁగ
మంచికస్తూరినామంబు దీర్చి
కట్టాణితెలిపాలకాయము త్రైవుటొంట్లు
చెలు వీన వీనుల నలవరించి
పునుఁగు జవ్వాది కప్పురము గుబాళించు
కలపంబు మేన జొబ్బిల నలంది

గీ. మిసిమిగెంపెముకాంతి వెల్వసర వింత
వగబవంతిదుప్పటి వలెవాటు వైచి

చకచకల్ గలరత్న పాదుకలు దొడిగి
ధవళచంద్రుండు మోహాంబు తరువు సేయ. 138

చ. పరమవినీతి నాతి చెలిపావడచేఁ దడియొత్తియొత్తి పై
పొర నడిమీ నెయుం దిగిచి పొంకముగాఁ గొనగోరఁ ద్రుంచివే
మరు బొటవ్రేలఁ దీసి తగుమాత్రము సున్నము వెట్టిచుట్టియ
య్యెరుగడనొక్కయాకుమడు పిచ్చిన నందివిడెంబు సేయుచున్.

చ. కలరవ శారికా శుక పిక స్వర సుస్వర భాస్వరోక్తి సం
కుల మకళంక నంకుమద కుంకుమ పంక కురంగనాభి గం
ధిల మాఖిలస్థలస్థగిత దివ్యమణీగణ చాకచక్యమం
జులమును నైన యాభువనసుందరి కేళిగృహాంబు చేరఁగన్.

గీ. ఒకతె పావడ లందీయ నొకతె కుంచె
వైవ నొకతె లామజ్జకవ్యజన మూన
నొకతె కైదండ యొసఁగ నిట్లుభయపార్శ్వ
ములఁ బలువు రాడిగము సేయఁ బోవునపుడు. 141

వ. అంత. 142

ఆ. ధవళ చంద్రకాంత నవ వేదినుండి యా
ధవళచంద్రకాంత తత్తటమున
ధవునిరాక కాంచి దమి లేచి కుముదబాం
ధవు నిరాకరించు నవు మొగమున. 143

సీ. ఉమ్మెత్తపూవంటి యొఱ పైనకుచ్చెళ్ల
చెఱఁగు మట్టెలమీఁదఁ జిందు దొక్క
మెఱ పైనవలరాజుమేడపై బంగారు
కుండలో యనఁ గుబ్బగుబ్బ లొరయ

నెమ్మోము రేరాజు సమ్ముఖమ్మునఁ గ్రమ్మి
  కమ్మపంజుల మెఱుం గెమ్మె నెఱప
భోగినీమణి గానఁ బొంగు నేయఁగ వచ్చు
  నీలాహి యన వేణి నీటు నూప

గీ. సైకతనితంబ మొకవింత చలన మొంద
నలఁతి లేనడు మల్లల నాడుచుండ
నవని నిదిగాక యొయ్యార మద్దిర యని
యెంచ నట నాతి వచ్చె రాయంచనటన. 144

క. అటు లెదురుగ నేతెంచిన
కుటిలాలకఁ గూర్మి యనలుఁ గొనలుం బొఱ
జిటిపొటినవ్వులు గనుఁగవఁ
బొటమరిలం జూచి పలికెఁ బులకల్ దొలఁకన్. 145

క. నీదండకు రాకుండినఁ
బూ దండల వ్రేయు నన్నుఁ బొడగని నేఁ డో
వేదండగమన సుమనగ
కోదండధరుం డ దేమొకో దండ మనెన్. 146

క. అని సరసోక్తుల మక్కువ
గనిపింపఁగఁ గలికిఁ బలికి కరపల్లవ మిం
పొనరంగఁ బట్టి మొల్ల వ
తనుసంగము సౌఖ్యవివశతను జని చెంతన్. 147

సీ. నికరంపుజిగికెంపు నీలంపురా చెక్క
  డపుసకినల పగడంపుఁగోళ్లు
పొరాయలుగుజ్జరినేఁత పొంబట్టుఁబట్టెడ
  పఱ పైనజాలీల పట్టుఁబఱపు

వచ్చసూర్యపటంపు బటువుబిల్లలు రంగు
సొంపుచొకాటంపుఁ దలగడయును
దఱు చైనపహరుముంజి తళ్కుముత్తెములచ
ప్పరమును జిగిదోమ తెరయుఁ గల్గి
గీ. మంచివగఁ జొక్కమైనట్టి మంచమువయిఁ
జలువ చెంగల్వ చేమంతి జాజివిరులు
పఱచి కడుఁ బొంకపఱచిన పాన్పుమీఁద
రాజు పవళించి యున్నంత రాజవదన. 148

సీ. ఎవ్వ రెప్పు డటంచు నెనయఁ గోరెడుకోర్కి
మరలించె బోటులఁ దిరిగి చూచి
సరగఁ బైఁ బడ దీయ మరలుగద్దఱిచూపుఁ
బదరకు మనియెఁ గంబమున నొదిగి
చిట్టాడుసిగ్గుతోఁ జేపట్టి పెనఁగుడెం
దము మట్టుపఱచె నాననము వంచి
తనుఁ బిల్వఁ దమి హెచ్చియును జాగు సేసె గ్ర
క్కనఁ బోక కన్నడఁ గట్టిపెట్టి
గీ. వలపు పతి సేవ నటు నిటు నిలిచి కొంత
కొంత తఱితీపు మైఁ జేరి కూరుచుండె
మగలు పైకొనునందాఁక మనసు గాన
నీయ రెంతటివగలవా రిందుముఖులు. 149

చ. సరసపుసవ్వులన్ దనివి చాలని చుంబన గుంభనంబులన్
బరిపరిరీతులన్ మెఱయు బంధవిశేష గళారవంబులన్
సురత మొనర్చి ముప్పిరులసొంపునఁ దేలిరి వార లయ్యెడన్
సరివల పైనకూటమికి సాటిక లేదు గదా తలంపఁగన్.

క. పెన్నురులచెమట మోదుప్పం
గన్నుఁగవఁ బెడలునీళ్లు గలవారలకుఁ
బన్నీరు గ్రోలుటయు నం
త న్నిద్దురవోవుటయు హితం బై యుండెన్. 151

చ. గముకవుగబ్బిగుబ్బ లెదఁ గాఁడ నొకించుక గాఁగిలించి యిం
పమరఁగ నిద్రవోయి యపు డల్లన మేల్కని శయ్యనోర నై
గుమగుమవాననల్ గుబుబుకొన్దనవుక్కిటిలోని పీడియం
బుమియ మొగంబు ఎంచి సుగుణోత్తముఁ డప్పుడిగంబు
చెంగటన్. 152

క. మినమినమనుపావలు గని
కనలున నిట వింత పాదుకలు రా నేలా
వనితా చెల్పు మి వెవ్వరి
వని తా గద్దించి యడుగ నరనిద్దురలోన్. 153

చ. భయపడి లేచి వే యదురుపాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ
వియు నెలవంకచన్నొనల వేసియు వేయని పైఁటకొంగు
దోఁ, వియు నటఁ దోఁవకున్న యలపెన్నెఱికొప్పును నై వి
తాకురా, లయి యవి చూచి యల్లలన యల్లల నాడుమ
నంబుతోడుతఁ. 154

గీ. అవుడు కన్నీరు గాఱ నోం డాడ వెఱచి
నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి యున్న
నీరమణివల్ల సంశయం బెఱుకపడక
పడకయిలు వెళ్ళి వచ్చి భూపాలుఁ డలుక. 155

క. మొకమజ్జన మై సంధ్యా
దికకృత్యము లాచరించి దివ్యవిభూషా

చకచకలు మేనఁ బర్వఁగఁ
దుకతుకతో నుల్ల మపుడు తొట్రుపడంగన్. 156

చ. కొలువున కేఁగి వేత్రధరకోటి నిజాయతదృష్టి వాలుచో
బలసి తటాలునం బగిలి పాఱ బరాబరి సేయు మన్నివా
రలు దునెదారులున్ దొరలు రాజులు మంత్రులు నిష్టబాం
ధవా, వళులు పురోహితు ల్బనులవార లనేకులు నిండి
యుండఁగన్. 157

వ. అప్పు డప్పాదుకలు దెప్పించి యుందఱముందఱం బెట్టించి భూవరుం డని యెవ్వరి పని యడిగిన హాక్రువ్వ నేరక నివ్వెఱయు సంశయంబును హృదయంబుల నతిశయం బయిన నొకరొకరిమొగంబులు సూచుచు సభాజనంబులు గుసగుసలం బోవుచున్న సమయంబున. 158

గీ. అవుడు చెవిదండఁ జేరి కే లడ్డగించి
మంతనంబునఁ జౌ రాళికుంతలారి
కాలకేతుం డనెడు పేరు గలతలారి
వానివెత లారివోవ భూవరున కనియె. 159

చ. తెలియఁగఁ జూచినాఁడ నివి దేవర నందియ మిందు కేమియు
న్వలదు సుమంతుపావ లనినన్ లయకాలునిలీలఁ జేర్చున
య్యలుక సభాస్థలిం గలుగునయ్యలు కంపితమానసాంగు లై
యలుక సుమంతుఁ జూచి యతఁ డన్ వికటభ్రుకుటీనిరీక్షుఁడై.

క. ఓపాపాత్మక లోనికి
రా పొమ్మని చన వొసంగి రాణువ యెల్లన్

నీపార్శ్వంబునఁ జేసి ము
హాపరమాప్తునిఁగ నడప నాదట నిన్నున్. 161

క. అసమాన రాజ్యవైభవ
లసమానునిఁ జేయుటకు ఫలం బిది యేమో
యిసుమంత యెఱుఁగ వేమో
యి సుమంత కృతఘ్ను యర్హ్యమే నినుఁ జూడన్. 162

వ. అని కోపాటోపంబున నయ్యేలావతి కర్ణకలాపంబులుగాఁ గొన్ని దురాలాపంబులు పల్కిన నుల్కిపడి యొకనాఁడును మాఱెత్తుమాట పడనివాఁడు గావునఁ దనవల్లఁ గల్ల లేకునికియు నిట్టి యపఖ్యాతి రాఁ దగునే యని నిలువునకు నిలువునవే కరఁగి నెఱఁజెమట వెట్టి తల వంచుకొని. 163

క. అడలుచుఁ బెదవుల దడుపుచు
గుడిగొనుకన్నీరు గ్రుక్కకొనుచున్ మదిలో
నుడువనిజెంజిలి నేఁడయు
నుడువనియవమానఘనుఁ గనుంగొని వేగన్. 164

గీ. ఘుటిక మ్రింగినసిద్ధునియటుల నుల్లి
దిన్నకోమటివలె నూర కున్నవాఁడు
తెంపుమై వీని నెటులఁ జేయింపవలయుఁ
దెలుపుఁ డన శాస్త్రసరణి సుధీజనములు. 165

చ. ధ్రువముగ రాణివాసమున ద్రోహ మొనర్చినవాని కాజ్ఞ త
ద్భువనము ముట్టుకొ ల్గాని విభావరిఁ గాళ్లను జేతులు న్మహా
టవిఁ దునిమింపఁ జెల్లు ననుట న్విని యట్లనె సేయుఁ డంచు న
య్యవనిసురుం దలారులకు నప్పనసేసె నృపాలుఁ డయ్యెడన్.

క. నెల విచ్చె నూతఁ ద్రోయఁగ
నలివేణిని జీవితేశుఁ డై మును ప్రేమం
బొలుపొందెఁ గానఁ దుది న
య్యెలనాగకు నతఁడ జీవితేశుం డయ్యెన్. 167

ఉ. పట్టుఁడు పట్టుఁడంచు నరపాలునిభృత్యులు నండడించుచున్
గట్టిగ నాతనిన్ విఱిచి కట్టిరి తన్నిలయంబు ముట్టుకో
ల్పట్టిరి చుట్టుపట్లఁ బదిలంబుగఁ గావలి పెట్టి రాప్తులుం
జుట్టపురాండ్రు బిడ్డలును శోకపయోనిధిలో మునుంగఁగన్.

క. చేయఁ దగునె రాజులు ల
న్యాయముఁ దనుఁ గర్మసాక్షి నడుగ న్వలదా
బోయ యని రోసి కడకుం
బోయెనొ యన నంతఁ బ్రొద్దు పోటుకునఁ గ్రుంకెన్. 169

ఉ. ఆతతిఁ గొంచుఁ బోయి తలయారులు ఘోరవనాంతరస్థలిన్
జేతులు కాళ్లు తున్కలుగఁ జేసిన నాయపరాధహీనుఁ డా
పాతకదూరుఁ డాపరమపావనుఁ డాసుకుమారదేహుఁ డు
ర్వీతలమేదురీభవదసృఙ్నవబాష్పజలప్రవాహుఁ డై. 170

గీ. హరి హరీ రామ రామ నారాయణా య
టంచు వేదనఁ బొరలుచు నకట తన్ను
నవ్వఁ డీ కపటోపాయ మెంచఁ జేసె
నతని కీపాటులే వచ్చు ననుచుఁ బలికి. 171

క. అసురుసు రై వ్యసు వై యువ
నిసురుం డటు తనువుఁ దొరఁగ నేరమి లేకే
యుసురు మనక పోయెదువా
దుసురు మనక పోవునే నృపోత్తమతనయా. 172

గీ. అసుమంతుండు రాజరాజై జనించె
నలజయంతుఁడ వీ వైతి వలఘుచరిత
యెవ్వఁ డేకాలమున నెంచి యేమి చేసె
నాతఁ డాకాలమున నట్ల యనుభవించు. 173

వ. కావునఁ బూర్వజన్మదుష్కర్మంబువలన నీ కీదురవస్థ వాటిల్లెఁ గాని నీవలన నిప్పుడు దోషం బీషన్మాత్రంబు లేదు మీఁద శుభంబు రాఁగల దని పలికి యశరీరవాణి యడుగ వెఱఁగుపడి రాకొమరుండు పైపైఁ బెరుఁగుసారుగునట్టి ధరం బడి పొరలి కొలఁకి లిడుచుండె నంతఁ దత్కథావృత్తాంతం బంతయు నికుంజాంతరంబున నుండి యాకర్ణించి. 174

క. వంతఁ దల యూఁచి యారా
యెంతటిమాయలది యింత యెడ సేసిన దా
యింతియ కద రా జేలిక యి
నింతియ కద యని తలారు లెంతయుఁ జింతన్. 175

క. కువలయనేత్రాత్మజుఁ డగు
కువలయనేత్రాత్మజుని యకుంఠితరుచి ది
వ్యవిభూషణములు గొని కన్
గవలను నీ రొలుకఁ బురమునకుఁ జని రంతన్. 176

గీ. తనదుపేరిటిసారంగధరుని నిరర్థ
లాత్ము దండింపఁ జెల్లునే యనుచుఁ గనలి
భువనజాతభయంకరస్ఫూర్తి వెడలె
నన మొఱసి యెత్తివాతె రథాంగవైరి. 177

గీ. మేలు పిచ్చుగుంటుమీఁద భాగీరథి
వచ్చె ననఁగ నపుడు వానిపైని

గగనభాగతలము నిగనిగ చంద్రికా
లహరి యుబ్బి జొబ్బిలంగ నిండె. 178

ఉ. ఆసమయంబునం దొకమహాత్ముఁడు సిద్ధుఁడు సత్సభానాథుఁ
డై, భాసురశీలుఁ డన్నగముపై నొకచో గుహలోన
నుండి యా, రాసుతుదీర్ఘరోదనవిరావము వీనులఁ బడ్డ
గానలో, నీసరిప్రొద్దు వోవునెడ నెవ్వఁడొకో విలపించు
చుండెడు. 179

క. ఆరసి వత్తము గాకని
యారసికుఁడు తాపసోత్తమాగ్రణి దీనా
ధారామితకరుణామృత
ధారాధారేయవికసిత మనోంబుజుఁడై. 180

సీ. పెనఁచి కెంజడలు నెత్తిని దండుగాఁ జుట్టి
సింగినాదముకొమ్ము చెంపఁ బెట్టి
వంచవన్నెలయోగపట్టె పొందుగ వైచి
ప్రొద్దునిద్దపుమేన బూదిఁ బూసి
పొడలయొడ్డాణాన నడుము చాల బిగించి
వెలిపట్టుగంతి మైఁ నలవరించి
పెళపెళ మనెడుబెబ్బులితోలు మొలఁ గట్టి
చికిలిలాతపుఁగోలఁ జేతఁ బట్టి

గీ. యక్షమాల సువస్తులకక్షపాల
చెవుల నెలరాలకామాక్షు లవటుసీమ
నన్నవిడిగాడరుద్రాక్షసరము లమర
గిలుకుఁబావలు దొడిగి కుత్కీలము డిగి. 181

ఉ. అల్లన నేఁగి వాఁడు తను వంతయు నెత్తుటఁ దోఁగి భూమిపైఁ
ద్రెళ్లి నెగుల్ ఘటిల్లఁగను దేలఁగ వైచి తలంకఁ జూచి హా
చెల్లరె యెంతపాతకము నేయఁగఁ జేసిరొ యిట్లు చందమా
మల్లునిఁ బోలు నీకలిరుటందవుఁ జక్కనికోమలాంగునిన్.

మత్తకోకిల.

ఏటికిన్ మదిలోన సంశయ మింక నాతఁడ తెల్పు నా
మాట వింద మటంచు నోయి కుమార యెవ్వరివాఁడ వీ
పాటు రాఁగను మేమి నీకు స్వభావ మెవ్వ రటంద్రు నిన్
జేటతెల్లమి గాఁగ నంతయుఁ దెల్పుమా యని యాదటన్.

క. తాపననాథుఁడు వలికినఁ
దాప సనాథుఁ డగు రాజతనయుఁడు ముంజే
మోపి మొగి మెత్తి నెమ్మన
మోపిక లేకోపాటిల్లి యును రసు రనుచున్. 184

ఉ. ఆర్చెదొ తీర్చెదో తెలుప నయ్యెడి దే మని యంతఁ దేరి హా
యోర్చు టెటుంగ కంటి నద యోత్తమ నీ వెవరయ్య నన్ను నీ
డేర్చఁ దలంచి మానవుని రేవను వచ్చినశంకరుండవో
కూర్చినప్రాణబంధుఁడవో కూరిమి రాఁ గత మెయ్యదియ్యెడన్.

సీ. వినవయ్య రాజరా జనురాజతనయుఁడ
సారంగధరుఁ డన జరఁగువాఁడ
నొకపావురము వెంట వెకలి నై నవతిత
ల్లింటికిఁ జన నామె యింటి నుండి
కామాంధురా లయి కలయఁ గోరిన నీవు
జనని వే సుతుఁడ దోనం బటంచుఁ

దలఁగి వచ్చినఁ దనతప్పు నావయిఁ జూపి
భూపాలునకు నెగఁబోసి యీర్ష్య

ఆ. నాజ్ఞవెట్టఁ జేసె నలకన్నతండ్రియు
వెరవు మాలి యిటుల వేగిరించెఁ
దానవేంద్ర యింక దైవంబు నే మని
దూఱువాఁడ నట్టి దూరు వాడ. 186

ఆ. మృగకులంబె కాని పుట్టాడ మానిసి
యెందు లేనియట్టి యీ యడవిని
నీసుధారసోక్తి నెఱయ నియ్యెడ విని
చెవులు చల్ల నయ్యె సిద్ధవర్య. 187

వ. నీవు మహాయోగిపురుషుండ వని తోఁచె నీసమ్ముఖంబు గలుగుటం జేసి యింతతడవు మాటాడఁ గలిగెఁ గరంబు వరంబులు దివియుచు నున్నవి మున్న కరపదచ్ఛేదనం బొనరించిన వారినే కంఠలుంఠనం బొనరింపుఁ డని వేఁడుకొన నైతి ధారాళకీలాలంబులు గోళ్లఁ బయిం బడుపిపీలికామక్షికాదికంబుల జోవఁ జేతులు లేవు గర్భశ్రీమంతుం డయినరాజకుమారునకుఁ జమీ యీపోఁడుములు చూచితే యని మోళ్లు నూపి తత్కరంబులు శిరంబునఁ జేర్చి యింక నొక్కటి విన్నవించెదఁ జిత్తంబులోనఁ గోపంబు లేదు గదా యని దీనాలాపంబుల. 188

గీ. అనదుగాఁ జూడ కీమాట యఘము చెంద
దనదుగా నిన్ను వేఁడెద యతివరేణ్య
యలమట నహింపఁ జాలను బొలియ నొక్క
మందు గల్గిన దయ నేయుమా రయమున. 189

౧౮౨.

అనిన నయ్యకలంక మై యలరారుసీరుకొలంకుని
మ్మనము గల్గు మహానుభావుఁడు మాళవక్షితిపాలనం
దనునివేదనఁ జూచి హా గురునాథ యీశ సదాశివా
యనుచుఁ దామరపాకునీరు క్రియం దలంకి దయామతిన్.

క. వినవోయి రాజనందన
తను వేటికిఁ దొరఁగవలయుఁ దల్లడపడఁ గాఁ
జనుని పురాకృతకర్మం
బనుభవమునఁ గాక తీరునా యెవ్వరికిన్. 191

గీ. మందు దయనేయు మంటి వే మందు నిన్ను
మందులకుఁ గాక యిటు నేయు మాకుఁ దగుని
యనఘుగా నన్ను వేఁడెద నంటివి గద
యుదియుఁ దప్పదు పాణము త్తడలవలదు. 192

క. మనపాలఁ గలఁడు శంకరుఁ
డనపాయోపాయుఁ డాత్రితానేకాప
ద్వనపావకుఁ డా లోకా
వనపాటవుఁ గొలువ లేనివస్తువు గలదే. 193

మ. అని యూరార్చి కుమారుఁ గొంచు జని వే యమ్మానవా
ధుండు న, ల్లనిచెంగల్వదొనం దనూరుధిర మెల్లం దోమి సీరా
ర్చి వా, ల్గనుదోయిం దడిఁ దోఁచి తేటజలముల్ గా దోయి
టం దెచ్చి ద, ప్పి నివారించి యలంత దేర్చి యతనిం బెం
పొందఁగాఁ జేయుచున్. 194

చ. తనగుహాలోపల న్నిలిపి తా మును గోలఁగఁ జిక్కినట్టిచి
క్కనితరిపాలుదానవుదుకంఠము మోవఁగఁదావఁజేయ మేన్

బన్నుపడి నీట ముంచినను బాలను ముంచిన నీవె దిక్కు నా
కని యుచితోక్తులం గదుప్రియం బొనరించి సతిండు జేరుచున్.

గీ. అరయ భువనైకమహిమాధ్యుఁడైన యట్టి
మత్స్యనాథుండు రాజకుమారమణికిఁ
గరచరణపంకజోత్పత్తి గలుగఁజేయ
నొకయుపాయంబు చింతించుచుండె నంత. 196

క. తెలతెలవాఱఁగ వచ్చెను
వెలవెలఁ బాఱె నెల దోవలు విలవిలఁబడియెన్
బలపల నయ్యెం జుక్కలు
కలకల నగె దిశలు పక్షికలకల మెసఁగెన్. 197

ఉ. కొందఱు పాండురంబనఁగఁ గొందఱు శోణమనంగ నీటఁ బొ
ల్పందఁగఁ జేసి పాల్కడలి నంటినజిడ్డది తెల్పు గా దిదే
సందియ మేల చూడుఁ డని చక్కఁగ నజ్జలశాయి కౌస్తుభం
బందఱు చూడ నెత్తె నన నంత నభోమణి దోఁచె నెట్టఁగన్.

మ. అలరాజట్లు కుమారు దండనము సేయం బంచి శోకవ్యథన్
నిల కావేగున నిద్ర లేక కడలుచున్ నిద్రించి మేల్కన్నపొ
ల్పలరం జాల నలక్ష్యరూపముగ గాల్యప్రక్రియల్ దీర్చి మో
నలఁ గొలైవ్వ తల వంచి ఖిన్నుఁడయి చాంచల్యంబుతో
నుండఁగన్. 199

క. తలవరులు వచ్చి ధరణీ
తలవరులు ప్రధానులును హితజనులుఁ దగువా
రలు నింతటంతటం జం
కలఁ జేతు లిడికొని యుండఁగా నృపుమ్రోలన్. 200

క. నిగనిగనిభూషణము లిడి
నగలున నడ్డపడి యేడ్చి నేఁడు కుమారుల్
సుగుణాఢ్యుం డని తెలియక
తెగి యూరక యాజ్ఞ పెట్టితిరి గద యంచున్. 201

క. ఆకాశవాణి సెప్పిన
యాకథయును నూఱడించి యనుటయుఁ దెలుపన్
శోకము హర్షము వెఱఁగును
జేకొనరింపంగ విభుఁడు చిత్తం బగులన్. 202

ఉ. దిగ్గన లేచి బంధుల సుధీమణులం దగువారిఁ దోడుకొం
చగ్గల మైనకోపమున నంతిపురంబున కేఁగి దీనికిం
దగ్గదు తాల్మి సామవచనంబులఁ గా దిఁక నిష్ఠురోక్తులన్
బెగ్గిలఁ జేయఁ జెల్లు నని పిల్వఁగఁ బంపి లతాంగి నయ్యెడన్.

గీ. ఓసి పాపాత్మురాల నీ వేసదారి
గాయకపుసుద్దు లెల్ల నాకాశవాణి
తెలుప విని వచ్చి తలవరుల్ కొలువులోనఁ
జెప్పినా రిప్పు డంద ఆచ్చెరువు నొంద. 204

గీ. టక్కు టకటొంకు టాటోటు తవలు వగలుఁ
గట్టి పెట్టెంకఁ గలది కలట్టి దెలుపు
తెలుప కుండిన నీబుద్ధికొలఁది చూడు
మఱి యనుచు రాజు బెదరించి మాటలాడ. 205

క. వంచాడించిక తాలిమి
డించక బిగు వెడలి దల్లడించక మదిలో
నించుకయైనను దాఁ జలి
యించక యాగట్టువాయి యిట్లని పలికెన్. 206

చ. తెలిసితి హా యి దంతయును దేవరపట్టపుదేవికై తవం
బలసుతుపాడిఁ దప్పినను నాజ్ఞ రొనర్పఁగ లంచ మిచ్చి వే
పిలిచి తలార్ల చేత నవిపించిన దిట్టుల నీకు వాళము
లైలియక వెట్టిరాజ యిది లెన్న నిజం బని నమ్మినాఁడవే. 207

సీ. ఎ-త నేసినది నేఁ డిది విన్నఁ గన్నఁ జో
ద్యము గాదొ మఱి దబ్బు దబ్బిన నిటు
వలె నుండవలె మెచ్చవలదె యిందులకు ర
త్నాంగిని జూచినయట్టి వార
లది నిజం బనవలెఁ గద యెన్ని గఱచిన
దాకాశవాణి యటంచు నొకటి
గల్పించినది చూడఁ గానలో నఁట రాత్రి
యఁట వారితో మాట లాడిన దఁట

గీ. కటకటా యెట్టివింత లాకాశవాణి
యాడఁ బలికిన దెటు పోయె నీడఁ బలుక
రాదె యివు డని వగ్గించి రాజకీర
వాణి పలికిన నాకాశవాణి పలికె. 208

గీ. ఇంత నేరక యుండిన నంతవనికిఁ
జొత్తువే బల్మిఁ గొంగును జుట్టి పట్టి
యెనయు మని నీ వనంగ నాయన పెనంగ
నాఁ డెఱుంగనె యంగనా నంగనాచి. 209

చ. అని వినవోయి రాజ భువనైకమనోహరమూర్తి యైన నీ
దనయునిఁ జూచి మోహపరితాపమున న్నిలు పోవలేక యా
చెనఁటి పయిం బడం గదియఁ జెల్లునె తల్లివి గావె నాకు నీ
వనికమఁ బాపభీతుఁడయి యాయనతగఁ ద్రోచిపోయినన్.

ఉ. కోపమునం గయాళి కొనగోళ్లఁ గుచంబులు తాన వ్రచ్చి
లోఁ, బావనియాను గాఁగ సుతుపై నటు నింద ఘటింప
నీవు న,ప్పావనిఁ బట్టి తెచ్చి కరపాదము కోయఁగఁ బంచి
యూరకే, పాపము గట్టుకొంటివి నృపాలక యెంతటిహంత
వెంచఁగన్. 211

క. నీతో నిఁక భాషించినఁ
బాతక మని యంత గగనభారతి యేఁగన్
భూతలపతి శోక వనీ
వాతసుహృత్తూలికీభవన్మానసుఁ డై. 212

ఉ. హా తనయా వివేకరహితాత్ముఁడ నై నిను నిగ్రహించితిం
గా తెగి లోకనింద కొడిగట్టితిఁగా జగజంత యైనయీ
భీతమృగాక్షిమాట చెవిఁ బెట్టితిఁగా యతిఘోరపాతకం
బీగతి నీతి మాలి రచియించితిఁగా యని సాశ్రునేత్రుఁ డై.

క. బజగనుగుదానిమాటలు
నిజ మని గురుభక్తినిరతు నిర్మలచరితున్
సుజనుఁ గుమారుని లీలం
గజునిం బో నాడుకొంటిఁ గద నే ననుచున్. 214

గీ. కుటిలచటులమలీమసక్రూరవర్త
నాలి దుర్గుణగణ జీవనాలి నాలి
నతి కుతల పూతనాలిఁ జిన్నాలి నతఁడు
కూపమున నూకఁ బనిచెఁ బెన్గోపమునను. 215

ఉ. ఆమెడ రాజునానతి మృగాక్షిని రజ్జునిబద్ధఁ జేసి య
న్యాయము రాకుమారునుగుణాగ్రణిఁ బావనశీలు నుత్తమున్
మాయలు వన్ని మచ్చరముమైఁ దునిమించెను జూడ నున్న

ద, న్నా యిది మేఁకవన్నె పులి యంచుఁ దలారులు గొంచుఁ
బోవఁగన్. 216

వ. కుచ్చితురా లైనయచ్చవలలోచనం జూచి పౌరు లందఱు
గచ్చుకొని గ్రచ్చపాఁ గదలించినకైవడి విచ్చలవిడి నోరికి
వచ్చినట్టు వెచ్చాన కిచ్చువారును దానికి నటువలెఁ గావ
లయు నని పగ్గించువారును దీని కివి పాటులా యని పండ్లు
కొఱుకువారును బావజాతికానా కన్నులు దెఱవనిపావని
పై నిరావనిందలు గడియించి యూనిసుపుగోడు పోసి
కొంటి వందుల నీ కేమి గలిగెనే యనువారును నిర్మి
మిత్త ముత్తమపురుషునకుం జేసినదోషంబు తోడనె చూ
పకపోవునే యనువారును 'సాహసం మద్గుణం చైవ' య
న్నది తప్పునే యనువారును నెంతకుఁ దెగించెఁ జూడు
మా యూఁడుదాని నమ్మవచ్చునే యనువారు నై యుండి
యును. 217

క. ఒం డేమి దోష మెఱుఁగక
యుండెడుసారంగధరుని నూరక పతితోఁ
గొండెంబు సెప్పి తోడ్కఁబడ
దండింపఁగఁ బనిచె నెంత దయ లేని దమో. 218

చ. తెలియఁగఁజూచినట్లనె సుదిక్ బుధు లారసి తప్పు నీపయిన్
గల దని పల్కుచోఁగుచయుగం బటు బట్టబయల్గఁ జేసి తో
యలికచ లేదు బంతి యన నందఱు డెందము నిశ్చయంబు పెం
పొలయఁగఁ గల్లతోడ నిజ మొప్పదుగా దలపోసి చూచినన్.

చ. కని కర మేది బిడ్డని నకారణ మూరక యిప్పు డయ్యెనో
కనికర మేది యాజ్ఞ యిడెఁగా తన బుద్ధి కలా లనద్వివే

కనికర మేమి యుఱ వినుతగౌరవకీర్తి వహించి యింక నిం
కనికలు మేదినీవిభుఁడు గాంచెను నేఁ డని పొక్కి రందఱున్.

గీ. చెలి యివుడు ఘోరపాపంబు చేసి మీఁద
నరకకూపంబులోఁ బడఁ దలఁచునీకు
నరక కూపంబులో నిపు డుఱుకు టరుదె
పాటు పడు మని పలికినపాటు పలికి. 221

క. జడ లల్లుచుఁ బిన్నప్పుడె
పడఁతులు తను నూతఁ బడెదొ పాఁతఁబడఁ బడెదో
నుడువు మనుమాట నిజ మై
పడె నూతను నార నూఱుబార లనంగన్. 222

చ. అటువలె నింతి నాజ్ఞ యిడి యామను జేశుఁడు మంగలంబునం
బెటిలినపేఁబగింజవలె మిక్కలి పుత్త్రివియోగబాధ న
ట్టిటువడి ధారుణీస్థలివయిం బడి నందనురూపరేఖలున్
బటుగుణశీలముల్ దలఁచి పల్వగలం బలవించుచుండఁగన్.

వ. అవ్వైశ్యవర్ధనమతి మతిమంతుం డతని కిట్లనియె. 224

క. తనునే యిటువలెఁ జింతి
ల్ల నృపాలక నింద రావలసె నాపలుకుల్
విన వైతివి చే యించిన
పనులకు నీ వింకఁ గస్తిపడవచ్చునొకో. 225

ఉ. మాను దురంత వేదనఁ గుమారిల నేల పసిండికొండవి
ల్కానివరప్రసాదమునఁ గల్గినవానికి హాని వచ్చునా
మానవనాథ యన్న మతిమంతుఁడ నీ వనుపల్ల నిక్క మౌ
నా నిది లోకనిందితుఁడ నైతిని నీవలు కాచరింపమిన్. 226

క. అరయఁగల పాత్రఁ గోరక
తెలివనడక యంద మని మది న్నమ్మి సుతుం
బరుసనిపాటులఁ బఱిచితి
బరు సని యిది యెఱుక లేక పదరితి నయయో. 227

ఉ. ఇట్టుగనుండె నాయెఱుక యేమనువాఁడ మహేశుసత్కృపన్
నెట్టన వాఁడు ప్రాణముల నిల్చినఁ జాలిటఁ దెచ్చి వెజ్జులం
బెట్టి గుణంబు చేసి మదిఁ బేరిన నెంజిలి దీఱ వాని కేఁ
బట్టము గట్టి కాసలఁ దప మ్మొనరించెద నయ్యు చయ్యనన్.

క. అనుగు లయి హితజనంబులు
ననుఁగుంజుట్టములు రాఁగ నపుడు దలారుల్
వనసీమ తెరువు చూపఁగఁ
జనియెన్ జననాయకుండు జాయాన్వితుఁ డై. 228

చ. చని మును దండనం బిడినచక్కని వధ్యశిలాతలంబుచా
వునఁ బడియున్న కెంజిగురుఁబోల్వసివాడినకాళ్ళఁ జేతులుం
గని నిగు లొందివట్టి నటఁ గానకమూర్ఛిలి యంతఁ గొంత నే
వున కినుమంత దెప్పిఱి విభుం డలపూఁబొదరిండ్లఁ జీరుచున్.

సీ. అరసి చూతిము పదం డాకానలో నున్న
నరసి చూతము తెచ్చి యనుచు నేఁగుఁ
గాన రే యే మైనఁ గని మొగాల్ దినిమెనో
కానరే యని వేఁటకాండ్ర నడుగుఁ
బొదల నెవ్వగ నై న వెదకి కానఁగ లేక
పొదల నెవ్వగ నేలఁ బొరలి యడలుఁ
దనయుని కీపాటు నెనయఁ జేసితి నయో
తన యుని కిఁక నేల యనుచుఁ బొగులు

గీ. వనరుహా యను సుకుమార వదన విజిత
వనరుహా యను వెత సేయవలెనె యింత
దైవమా యనుఁ దలఁపని తలఁపు లివిగొ
దైవమా యను తెలియంగఁ దరమె యనుచు. 231

సీ. దట్టంపువిరిమొల్ల తావులతావుల
సమరు లతాకుడుంగములగములఁ
జిల్లనిసురపొన్న చాయలచాయల
సరుదారుమాణిక్యదరులదరుల
వలిదేరు పన్నీరు వంకలవంకల
గాలి తేజీల నిల్కడలకడలఁ
గొంజీఁకటులు గ్రమ్ము కోనలకోనల
ఘనమైన యోగిపుంగవుల గవుల

గీ. సరసి పెదవులు దడుపుచు నరిగి యరిగి
దొరఁగున శ్రులు గన్నుఁదామరల మరలఁ
గుసుమబాణుని నగజాలుకొమరుకొమరు
విభుఁడు మదిలోనఁ బాయని వెతకు వెతకు. 232

వ. ఇట్లు తద్ఘోర కాంతారంబునఁ బలుదెసలం గొంద అను
చరులం జటుల నందుగొందుల నందంద నందనాన్వేషం
బొనరింప నియమించి తానునుం జని వేగ మృగ విహగ
తరు గిరి ప్రముఖ నిఖిలచరాచరంబులం జూచి యేచిన
దైన్యంబున. 233

ఉ. మిక్కిలి సా దనం దగిన మేటి నెఱుంగరె మల్లులార మే
లెక్కుడురూపువాని నిట నిచ్చటఁ గానరె మావులార పే

రక్కఱి నూని పెంపు గని నాతనిఁ జూడరె ధాత్రులార యిం
పెక్కన కొమ్మలార కనరే సుకుమారుఁ గుమారమన్మథున్.

గీ. మీకులములేటిఁ జేపట్టి మీవిరోధి
యైన ఫులిఁ జెండి మైచర్మ మూనెఁ గాద
యట్టిమేలైన నెఱిఁగి యా హరుని పేర
నెసఁగు సారంగధరుఁ జూపుఁ డేణులార. 235

శా. నాళీకారికి నొక్కజింక నొకయేణం బంజనాకామికిం
గాళీకాంతున కొక్కలేడి యిడి యింకం గూడునే మూఁడువా
టాలుంబెట్టిన చెంగనాలు సుము ముట్టఁ రాకుఁ డఱ్ఱీతి మీ
రేలా పోయెడ రేణులార నిలువుండీ మాసుతుం జూపుఁడీ.

సీ. తరులార చెంచుబిత్తరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారు
హరులార పవమాన హరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారుఁ
జలులార లేటిసుచ్చరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారుఁ
గరులార మానిశంకరులార కానరే
మాకుమారునిఁ బోలు మాకుమారు

గీ. నదములార చలత్కోకనదములార
శుకములార ప్రఫుల్లకింశుకములార
మాకు మాఱు వచింపని మాకుమారు
గానరే యని వెదకి రక్కానలోన. 237

సీ. కర్పూరవాసనల్ గలయంగఁ బొలయంగ
సారంగధరుఁ డని చేరఁ బోవ

శ్రీగంధవాసన ల్చిక్కంగ నిక్కంగ
సారంగధరుఁ డని చేరఁ బోవుఁ
గస్తూరివాసనల్ గమ్మంగ గ్రమ్మంగ
సారంగధరుఁ డని చేరఁ బోవు
జవ్వాదివాసన ల్జడియంగ సుడియంగ
సారంగధరుఁ డని చేరఁ బోవుఁ

గీ. బోయి ఘనసార ఘనసారభూజ మ్మృదుప
టీర మృగకుల సంకుల టంకుల నట
స్రుక్క తద్గంధసహితాంగు సుతుని నతఁడు
కానకడల విచారించి కాన కడల. 238

క. తలవరులుఁ నెలవరులుం
బొలపరుఁ వచ్చి యంత భూపాలునితో
మలలందుఁ నెలలందుఁ
శిలలందును నెల్ల నారసితి మే మందున్. 239

ఉ. కాన మటంచుఁ జెప్పినఁ గకావికలైన మనంబుతో నర
నాథుఁ గులాంగనానహితుఁడై యటఁ గ్రమ్మతివచ్చి కామినీ
నూనశరోపమాన సుత శోణిత వంకిల భూమి నామహీ
జాని భుజానిరాహత విశాలశిలాచయుఁడై పడెఁ బడిన్.

వ. అప్పుడు. 241

క. అక్కండి యా రేలుం గై
చెక్కులు నెమరించి నెఱులు చిక్కులు వడి కా
ల్మ్రొక్క వసి వాడి యూర్పుల
వెక్కం గెమ్మోవి కములి వికలాంగముతోన్. 242

క. పట్టాభిషిక్తుకడుపునఁ
బుట్టి మహారాజ్యసుఖముఁ బొందక కుదువం
గట్టం గల కాలంబునఁ
గట్టా నీ కడవిపాలు గావలసెఁ గదా. 243

క. ఎట్టోర్తు నన్న నీ వీ
కట్టిఁడి యగు దొడ్డరాజు కడుపున నేలా
పుట్టితివి పేదకడుపునఁ
బుట్టిన నొక కొంతకాలము సుఖంతువుగా. 244

ఆ. నిను వధించినట్టి వెనుక నయ్యశరీరి
పలుక కుండె నేమి పలికె నేమి
నీవు నచ్చువెనుక నామృషాచిత్రాంగి
పొలియ కుండె నేమి పొలిసె నేమి. 245

సీ. సంపెంగనూనెవాసనలఁ బెంపెక్కిన
యలకలా యివి కూర్మి తళుకుమొలక
చిట్టాడునాఁడు నాచిటికెనవ్రేల్వట్టు
చేతులా యివి ముద్దుఁజిన్నికూన
ఘలుఘలు మని యందియలు మ్రోయ నడయాడు
నడుగులా యివి ప్రోదియనుఁగుఁజూల
ప్రేమ నాచన్నిచ్చి పెంచిన నీమేని
నెత్తురా యిది పూపనెనరుపట్టి
గీ. యనుచు నట రాలి యున్నట్టి యతనికురులు
కరచరణఖండరక్తపంకములు మమత
నత్తి యక్కునఁ జెక్కున నొత్తుకొనుచు
నిందుముఖ యేడ్చెఁ గోయిల లెల్లఁ గదియ. 246

వ. అంత మహారాష్ట్రాక్రాంతుం డైనమహీకాంతుం డొకకొంత
తడవునకుం దెలిసి సంతాపంబున. 247

ఉ. ప్రేయసిమాట యట్లు చెవిఁ బెట్టి వృథా కరపాదహీనునిం
జేయుట కాక జీవ మెడఁజేయఁగ వచ్చితి నంచు దాఁగితో
నాయపరాధ మిం కిట మనంబున సైరిచి వల్కవోయి రా
వోయికుమారయెందడఁగితోయియటంచెలుగెత్తిచీరుచున్.

సీ. పరరాష్ట్రమున కైనఁ బాఱిపో బెదరించి
యిట్టట్టు గాసి చేయింప నైతిఁ
తప్పొప్పు శోధించి తరువాతఁ జెప్పెద
నంచు నేటికిఁ బెఱ నుంచ నైతి
సుఖముల నందిచ్చు సుతుఁడు గల్గఁడు గాక
లలన లేదురు దని తలఁప నైతిఁ
బదరి కార్యము నేయుపరుమవ ర్తనుఁడు వి
పన్నుఁ డౌ ననునీతి యెన్న నైతిఁ

గీ. గూడు చవి యని తిన నింకఁ గూడు నొక్క
తనువు త్యజియింతు ననుచు వింతనువు మీఱ
గుండు మెడఁ గట్టి భూభుజంగుండు నిండు
చెఱువులోఁ బడఁ బోఁగ వచ్చెరువు గాఁగ. 249

చ. పలికె రయంబునం జదలివల్కుల చిల్కలకొల్కి యంత హా
నిలు నిలు రాజ యిట్లు దగునే త్యజియింపఁ బురారిపట్టి మై
యలరినమత్స్యనాథుఁ డనునట్టిమహాత్ముని దండ నీదుగా
దిలినుతుఁ డున్నవాఁడు కడు దీమస మేది తలంక నేటికిన్.

ఉ. మేరుగిరీంద్రచాపుని యమేయకృపారసపూర్ణదృష్టి నీ
కూరిమిపట్టిపైఁ గలదు కొంచెములోనని కాయసిద్ధికిం

గారణ మున్న దాతనికిఁగా మదిఁ గుందకుఁ డీయనిత్యసం
సారమి దేమి భ్రాంతి ధరశాశ్వతుఁడై మను నాతఁ డున్నతిన్.

క. ఎక్కడిసుతు లెక్కడిసతు
లెక్కడితలిదండ్రు లెవరి కెవ రొకొ కొనన్
ళ్లెక్కడవడి తిరుగాడుదు
రక్కట యిది యంత మాయ యని యెఱుఁగరుగా. 252

క. మరు లింత దగుని నృపతికి
ధర పాలనసేయు కునికి ధర్మం బగునే
నరగునఁ దిరిగి పురంబున
కరుగుము చింతిలక మానవాధిపతిలకా. 253

ఆ. అతఁడు కరపదద్వయమ్ములు వచ్చి నీ
కడకు వచ్చి చూడఁగలఁడు మీఁద
నధిప నమ్ము దీని కనుమాన మేమియు
నింక వలదు వగల నింకవలదు. 254

క. నావుడుఁ దపాతపా వీడ్కొని
దై వారినవేడ్క రాజధానికి వేగన్
దేవియుఁ దానును నరిగి మ
హీవల్లభుఁ డచట రాజ్య మేలుచు నుండెన్. 255

వ. అంత నచ్చట మత్స్యేంద్రుండు నరేంద్రనందను నొక్క
మంచిమంచెపై నుంచి నిచ్చలుఁ గృపాలుండై గోపాలుండు
నిచ్చల మగుభక్తిని దెచ్చి యిచ్చుపాలు నగపాలు వాలుని
పాలు గావించి పోషించుచు నధ్యాత్మజ్ఞానోపదేశం బొనం
గం దలంచి యత్యంతనిమ నిష్టాసనాసీనుం జేసి యోగా
సన బంధవిశేషంబులు రేచకపూరకకుంభకంబుల విధం

బులును రాజయోగ హఠయోగ లయయోగ మంత్ర
యోగ లంబికాయోగంబు లాదిగాఁగలయోగంబులవృత్తాం
తంబులం దెలిపి యభ్యాసంబు సేయింపం గతిపయదినం
బులకుం బనుపడి యోగానందుండై యుండం జూచి సమీ
చీనయోగసమాధిగాఁ దెలిసి కరచరణాభ్యుదయసంపత్సం
పాదనసమయుం బిది యని యతం డూర్ధ్వదృష్టిం జక్కం
జూడకుండుటఁ బైకి నొకయఖండగండోపలం బెగయ వైచి
యిది తప్పక చూడుమా చూడ కున్నం జూడాతలంబునం
బడు ననినం దనదృష్టి మరల్పక చూచుచుండఁ గొంత
కాలంబునకు. 256

చ. మొలక లొకింత గాసఁబడి మోసులు మెల్లన వెల్లి సోగ
లై, నలకొని వ్రేళ్లు గోళ్లును జనించి చొకారము లై మి
టారికెం, దలిరుల బొమ్మ గట్టి యులతమ్ముల యమ్మెలు
చూఱ వట్టి యిం, పలరఁగ వచ్చె వాని కిరవై తగ వింత
గఁ గాళ్లు సేతులున్. 257

గీ. కాంచి యపుడు ప్రమోదించి మంచ దించి
నడవఁగా లేకయుండెడు నాతనికిని
దనకరము లిచ్చి హారువట్టి యొనరఁబట్టి
యల్ల నడుగిడఁ జేసెఁ బా టగుటఁ జేసి. 258

సీ. జుట్టువ్రేళ్లను రెండుఁ బట్టించి నడిపింపఁ
దలఁకుచు రా లేమి బలిమిఁ దిగుచుఁ
దనచేతినిడుదలాతపుఁగోల యందిచ్చి
మెల్లమెల్లన కొంత మెలఁగఁ జేయు

నవలంబ ముడిగిర మ్మన నా ల్గడుగు లేఁగి
పడఁబోవ గ్రక్కునఁ బట్టి నిలుపుఁ
జనుదెంచి బిరబిర దను నంటుకొ మ్మని
వచ్చిన నగుచు నవ్వలని కరుగు

గీ. నాఁడునాఁటికి నీరీతి నడవ నేర్పఁ
గొన్నినాళ్లకు నలవడి కొంకు దీఱి
లెస్స లై కరపదములు లీలఁ దనరఁ
బ్రేమ సారంగి యునిమొడి పే రొనంగి. 259

ఉ. సద్గుణరాశి యై తనరుసాత్త్వికమౌళికి వల్కలత్వనం
పద్గరిమఁ నమ స్తమణిమంత్రసుపహౌషధవస్తు లిచ్చి శుం
భద్గతి సిద్ధయోగకుల పట్టము గట్టి కృతార్థుఁ జేసినం
దద్గురునాథుమాట జవదాఁటక నిశ్చలభ క్తియుక్తుఁ డై.

గీ. కాయసిద్ధి వచస్సిద్ధి గలిగి యతఁడు
చెలులకాంతులు క్షుత్పిపాసలును లేక
పట్టినది యెల్ల బంగారుగట్టు గాఁగ
మెట్టినది యెల్ల నిధియు నై మెలఁగుచుండె. 261

గీ. ఉండి యొకనాఁడు తమవార లున్నకడకుఁ
బోయి రావలె నని బుద్ధి పొడమి వేఁడు
కొని గురుని నాఁ గడా వివేకులకు నెల్లఁ
దల్లిదండ్రులు మఱవ రాఁ దగనివారు. 262

గీ. గురునిపంపున సంతోషభరితుఁ డగుచు
బాదుకలు మెట్టి తలిదండ్రి వజ్జఁ దలఁచి
దలఁచినప్పుడె పోయి ముంగలను నిలిచె
నిలిచినప్పుడె విస్మయాన్వితు లగుచు. 2

సీ. మానేరమి మనంబులో నుంప కిటు వచ్చి
తక్కఱగలయట్టి యనుఁగుఁబట్టి
యాకాశవాణివాక్యంబుచే బ్రతికి నీ
కెదురునూచితిమి సుమ్మిన్నినాళ్ళు
మావంటిభాగ్యసంపన్నులు లేరుగా
గ్రమ్మఱ నినుఁ జూడఁ గలిగెఁ గాన
నీశ్వరాంశంబ యగా దీవు గాకుండిన
మనుజమాత్రున కింతమహిమ గలదె
గీ. యనుచు మొగములు దెలిసి దేహములు పొంగి
పలుమఱును గౌఁగిలించుచుఁ బాణిపాద
తలము లలముచుఁ దలిదండ్రు లలమి నపుడు
హరివేడుకలకు మితి మేర గలదె. 264

ఉ. ఇక్కరణిన్ సుహృజ్జనము లెంతయుఁ గన్నులఁ గప్పుగొంచుఁ
బే, రక్కఱఁ బూజ సేయ నతఁ డందులఁ గొన్నిదినంబు
లున్న నా, చక్కనియున్న యీధరణిచక్ర మశేషము నీవ
యేలు నీ, చక్కి భుజించుచుండెదము సౌఖ్యముతో నని
తండ్రి వల్కినన్. 265

గీ. నాగురుం డైన యలమత్స్యనాథుతోడ
నిదిగొ మావారిఁ జూచి వచ్చెద నటంచుఁ
బ్రార్థన మొనర్చి వచ్చిన రాక గాని
రాజ్యభోగేచ్ఛ వచ్చిన రాక గాదు. 266

సీ. సర్వ సర్వంసహా నిర్వాహక ఖ్యాతి
కాయసిద్ధిఁ బొసంగఁ జేయఁ గలదె

యంగనా దృఢ కుచాలింగ నానందంబు
ప్రాయంబు తిరముగాఁ జేయఁ గలదె
గంధసింధుర ఘటా గంధర్వ భట సేన
సిద్ధక్రియలు గల్గఁ జేయఁ గలదె
దివ్యరత్నావళీద్రవ్యరాశిసమష్టి
జీవద్వయఃప్రాప్తిఁ జేయఁ గలదె
గీ. యిన్నియును గల్గె గురుకృపాదృష్టివలన
యోగలీలాసుఖముకన్న నొక్క సుఖము
గలదె యని యిట్లు జ్ఞానంబు దెలిపి వారి
ధన్యులుగఁ జేసి సారంగి దయఁ జెలంగి. 267

గీ. వంశకరుఁ డైనసుతుఁ డుద్భవంబు నొందఁ
గలఁడు మీకొకఁ డని యనాగతముఁ దెల్పి
వచ్చి తడ వయ్యె నింకఁ బోవలయు గురుని
యొద్ద కని తల్లిదండ్రుల నుపచరించి. 268

ఉ. అచ్చటు వాసి యాశివపదాంబుజభక్తిధురంధరుండు మున్
వచ్చినత్రోవ నేఁగి గురునాథునకుం బ్రణమిల్లి నిల్చినన్
వచ్చితె యన్న రాజ్యవిభవంబులు హస్తగతంబు లైనచో
హెచ్చు గదన్న నీకుఁ బ్రతియెవ్వరు జ్ఞానమహత్త్వసంపదన్.

చ. అని గణుతింప సద్గురుకులాగ్రణి సేవను జాలఁ జేసి దీ
వనలు వహించి పుణ్యు లగువారలకుం దనదివ్యమూర్తిఁ గుం
భినిఁ గనిపించుచున్ దనదుపేరు దలంచినవారికిన్ యశో
ధనములు గల్గఁ జేయుచు సదా యతిఁ డుండుఁ జిరాయు
రున్నతిన్. 270

క. సారంగధరుచరిత మొ
వ్వారుం జదివినను వినిన వ్రాసిన సౌభా
గ్యారోగ్యవృత్తిపౌత్త్రి
శ్రీగణ్యజనాభివృద్ధిఁ జెలఁగుదురు సుమీ. 271

క. కలహారంభణ కౌతూ
హాల పులకిత భుజపరాక్రమార్జితనానా
జలదుర్గ వనీదుర్గ
స్థలదుర్గాహార్యదుర్గ సామ్రాజ్యనిధీ. 272

ఉ. శ్వేతగళైకలాంఛన విజిత్వర శుభ్రయశోవిశాల ధా
రాళగళన్మదద్విప విరాజిసభాభవనాంగణా ధనా
వేళగరిష్ఠదాన పదవీపరితోషిత కాశి గౌతమీ
చోళకవిద్విజస్తుతివచోలగ చోలగమానభంజనా. 273

భుజంగప్రయాతము.

అరాతిక్షమాభృద్భిదాంచత్ప్రతాపా
నరాధీశ్వరాకారనాళీకబాణా
స్థిరానందనారాను సేవాధురీణా
విరాజచ్ఛ్రుతుష్షష్టివిద్యాప్రవీణా. 274

గద్యము. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ ప్రసిద్ధవా
గ్వైభవ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ సదారాధిత
బుధసమాజ వేంకటరాజప్రణీతం బైన సారంగధరచరిత్రం
బను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

సా రం గ ధ ర చ రి త్ర ము
సంపూర్ణము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1922.

# ఆంధ్రగ్రంథములు.

---

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— ... | | |
| 7 సంపుటముల ప్రతి ... | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి ... | 15 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, కాలికోబైండు ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు ... | 4 | 0 |
| గోపీనాథరామాయణము, 7 సంపుటములు శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | 6 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము ... | 0 | 12 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యములు ... | 8 | 0 |

---

| | | ప్రతి 1–కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుగురామాయణము శుద్ధప్రతి | ... | 1 | 4 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము. | ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము. శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందు గలవు | | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 8 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము | ... | 8 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | ... | 0 | 12 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవి | ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవికృతము | | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచితిమ్మకవికృతము | ... | 0 | 4 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ప్రణీతము ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి, అబ్బయామాత్య ప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవి ప్రణీతము ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము ... | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్య ప్రణీతము ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కనికూర్పు | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 14 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజాన ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది | 2 | 8 |
| డిటో మేలుప్రతి కాలికోబైండు ... | 3 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము చక్కనికూర్పు ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| వైశ్యపురాణము ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 6 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| శ్రీనాథునివీధినాటకము ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మాతృశతకము | ... | 1 | 2 |
| *సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| *కుమారీశతకము ,, | ... | 0 | 3 |
| దాశరథీశతకము ,, | ... | 0 | 4 |
| మానవబోధశతకము ,, | ... | 0 | 3 |
| *భాస్కరశతకము ,, | ... | 0 | 4 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 3 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| సింహాద్రి నారసింహశతకము | ... | 0 | 3 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| ప్రసన్న రాఘవశతకము | ... | 0 | 3 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| రామప్రభుశతకము | ... | 0 | 3 |
| రామరామశతకము | ... | 0 | 2 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| సంపగిమన్నశతకము | ... | 0 | 2 |
| భద్రాద్రి రామశతకము, పావులూరి మల్లనకృతము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము సూరకవిది | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి తిమ్మకవిది | ... | 0 | 3 |
| కాళహస్తిశతకము, 'సాంబశివామహాప్రభో' | ... | 0 | 2 |
| చిత్తబోధశతకము, తాత్పర్యసహితము | ... | 0 | 3 |

| | | ప్రతి 1-కి రూ | అ. |
|---|---|---|---|
| వేణుగోపాలశతకము | ... | 0 | 4 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| దసరాపద్యములు | ... | 0 | 3 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | ... | 0 | 6 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | 4 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| *గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| *కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| *రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| *నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారిది | ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | [illegible] |
| నీతిపద్యసంగ్రహము, సటీక | ... | 0 | [illegible] |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 1 | 10 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు ఉపన్యాసములు | ... | 0 | 1[illegible] |
| మదనమోహనమాళవ్యగారిజీవితము పంజాబుఅల్లరి | ... | 0 | 8 |

